శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాష లందుఁ దెలుఁగు లెస్స


సంపుటము [illegible] | సంచిక ౧

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

శ్రీ [illegible] శిరవ, కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

శ్రీ భాషాప్రవీణ [illegible]రి సూర్యనారాయణశాస్త్రిగారు.

---

## విషయసూచిక

శ్రీ

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౫ } దుర్ముఖ సంవత్సరము ఆశ్వయుజ – కార్తికమాసములు { సంచిక ౪

# మహాశ్వేత

శ్రీ టి. భాస్కరరావు

సురుచిరమైన చైత్రమిది ; చూత కిసాలము లెల్ల నెల్లెనె
తరుణహృదంబుజాతములఁ దార్చుచునున్నవి ; వారిజాతముల్
సరసుల కింపు నింపు పరుసమ్మున నుమ్మరమయ్యె ; చల్లన
య్యెర మరుచేతి కేతనము నెత్తె వియత్తలమందుఁ బొందుగా.

పొలుపుగ సుందరీమణులు పుక్కిట నుమ్మిన శీధు వాని మ
త్తిలి పొగడల్ విరుల్ విరిసి తీరుగ నవ్వె ; అశోకభూజముల్
గిలుకురవంపు నూపురము గీల్కొను లత్తుక కాలి తాపుచేఁ
బులకలఁ బోని సూనములఁ బుప్పొడి గప్పె సమీపమేదినిన్.

అలికుల మానసతీర మధురాసవపానము చేసి, తీగ డో
లల మెలమెల్ల ఝుంకృతివిలాసము భాసిల నూగుచుండె ; కో
కిలలు కుహూకుహూరుతులఁ గేళిమొనర్చుచు నారగించెఁ దే
నెల లవలీలతాకుసుమనిర్మలపాత్రికలందు విందుగా.

ఏతదమేయసుందరవనేందిర కాళ్ళకు గజ్జెకట్టి సు
స్ఫీతమనోనుమోదనవిశేషముతో నటియించువేళ, సం
జాత కుతూహలానఁ బరిచారిక యొక్కతె తోడుగా "మహా
శ్వేత" హిమాచలాంతరవివిక్తసరోవరభూమికిం జనెన్.

ఆ దివి నచ్చరల్ గలరుగా ! పదునాల్గు కులాలవార లం

గోత్రోదయ మేమొ! “చిత్రరథుఁ” డుజ్జ్వలకీర్తి ప్రభుత్వపీఠిపై
సాదరగౌరవమ్మున నిషణ్ణుఁ జేసె జగమ్ము మెచ్చఁగా.

ఆతని కానుహల్యవతియై, మనిలోపలి భావరూపయై
శీతసురాపగాసలిలశీకరసేకములోని హాయియై,
పూతశశాంకవంశమునఁ బుట్టిన “గౌరి” యనుంగు సాధ్వియై
చేతము నాచుకొన్నయది చిక్కని సత్రములోని యీనెగా.

వీరల కాఁడుబిడ్డ ప్రభవించిన దంతట ; పుత్రిజన్మ సా
ధారణమైన వేడుక లుదారముగా నొనరించినారు ; సం
స్కారము చేసినారు ; మమకారముతోఁ జెయి దింపకుండఁగా
గారము చేసినారు ; పసికందును ముద్దులుగారు సుద్దులన్.

గౌరీహంసుల గర్భజాతయన నేల ! గాంధర్వలోకమ్ములో
నే రామామణియేని, యే పురుషుఁడేనిగాని గారాముతోఁ
దారే తల్లియుఁ దండ్రియేమొ యను వాత్సల్యమ్ముతోఁ జూచు రా
తీరే వేలుగదా ! శిశుత్వ మిటులే తీరెన్ మహాశ్వేతకున్.

అంత వసంతవేళ మధువై, మధుమాసమునం గిసాలమై,
కాంత కిసాలపాళి వెనుకం దగుపువ్వయి, పువ్వుపై మధు
భ్రాంతిని వ్రాలు తుమ్మెదయి, రంజిలు తుమ్మెదలోని దిమ్మునై
కాంతకు నవ్యయౌవనము గ్రమ్మిన దందము లారఁగట్టుచున్.

ఆ మహాశ్వేత పరిచారికానుయాత
యై, చతుర్దశీస్నానార్థ మరుగుదెంచి,
సార్థకాచ్ఛోదకాసారసవిధప్రకృతి
దర్శనాపేక్ష క్రమసముత్కటము గాఁగ.

హరుని దేవేరి జలకమ్ము లాడి పూడి
చలువపాలరా బంతుల నిలిపియున్న
వాలుకాలింగమూర్తుల భక్తి మీరఁ

"వరుని సన్నిధి లజ్జతో శిరసు వంచు
క్రొత్తమనుపర్కపుల పెండ్లికూఁతువోలె
చిగురుటాకుల సంఘులఁ జిన్నిపూవు
మధుపసన్నిధి వంగినవిధము చూడు !"

"చూడు మల్లదే ! ప్రాయంపుఁ జూతవిటపి
విరియఁ బూచిన ప్రసవమంజరుల పైని
రతివివశమై పికము సఖక్షతముసేసె
రాగసుస్నిగ్ధమకరందరసము లూర."

"కౌఁగిలింతల మన్నించు నాగరాజు
కలితహర్షమాయూరకేకలకు జంకి
వీడిపోయిన చందనవృక్ష మదిగో !
విభుఁడు దూర మేగిన తపస్విని విధాన."

"కష్టమయలోకసంతతసంఘర్షణమున
తేజ నొందెడు మానసవధిపునివోలె
నలుగు కొలఁది సువాసనల్ వెలువరించు
వకుళసుకుమారపుష్పసంపత్తి చూడు !"

అనుచు బహుధా పరస్పరమ్మనుమతముగ
సరసవాక్యముల ముందరి కరుగు వేళ
ఝటితిపవనోపనీతవాసన యొకింత
కౌతుకమ్ము రేఁపిన మహాశ్వేత యపుడు.
నరలోకేతర మద్భుత
సురభిళ మనవద్య మధికసుందరము నానా
పరిపూరణలేపనతతి
స్పర్శవాయువుఁ బట్టి యొక్క తరుణంబు గనియెఁ.

హా! కోపానలదగ్ధమన్మథవిమోహనంతచింతన దపః
స్థిరుఁ డైనట్టి వసంతుఁడో! హరజటాశీతాంశుఁడో! కాక యా

వారు నోడించుట కన్యమార్గగతసత్త్వాల్పత్వ మూహించి ని
ర్భరవృత్తిన్ దప మాచరించు మునుఁగో! భావింపరా దేరికిన్.

అతఁడు బ్రహ్మచర్యమున కాకృతి, ధర్మమె వానిజన్మనం
బాతతవిద్యయే వ్యసన మాశ్రయ మాగమరాశి ; వాని ముం
జేతుల నక్షమాలయును స్నిగ్ధకమండలు వుండె ; దక్షిణ
శ్రోతములో సుమాళముగ సూనము పేర్చుచునుండె వాసనల్.

దేవుని సృష్టిలోన వెలితిం గనఁజాలము గాని, వానికై
భావజు క్రిందుచేసె నవభావమనోహరరూపనిర్మితిం
జేవలు దేరినాఁడు సరసీజతనూజుఁడు ; తచ్ఛరీర తే
జోవలయమ్ము గ్రొంబసిఁడిసొంపులు నింపెను గాననమ్ములో.

అతనిరూపువంకఁ గను లార్పఁగఁ జూచి, మనస్సులో మహా
శ్వేత ప్రసూనబాణునకుఁ బీరము సిద్ధముచేసెఁ, దోడనే
కాతరవోయి యంగములు కంపము నొందె, చెమర్చె మేను, వా
గ్జాతము గొంతులోనె యణఁగారెను, మారెను వన్నె చెక్కిళుల్.

లోపలఁ జేరి మన్మథుఁడు లోఁతుపట్టి మథించె ; చిత్తమం
దోపఁగరాని వేదనల నూర్పుల పెంచెను ; లేశరీరముం
దాపము నార్చుకోఁ బులకిత మ్మొనరించెను కౌఁగిలింతకై ;
పాపము ! లేపినాఁ డొక నెప మ్మిడి గుబ్బల క్రుమ్ములాటయున్.

కాని, కులీనకన్యలకుఁ గానిదిగా యిది ; ఒం డొకళ్ళు కా
లీనము లైనరీతుల మలీమసవృత్తికి జారినం దగుం
గాని, తనంతవార లిటు కన్నులఁగప్పిన మాయఁ జిక్కి స్వా
ధీనత దప్పినం బ్రదుకు దెప్పరమై నిరయమ్ము గాదొకో !

ఇది యేదో విధినిర్ణయమ్ము ; తరుణీహృత్తంత్రి మ్రోగించి యీ
మదనుం డేమి తలంచినాఁడో ! జనసామాన్యంపుఁ బ్రేమేచ్ఛకున్
సదుపాయ మ్మొనగూర్చనే విమలతేజఃపుంజ మీమూని ? చూ
డదు సౌందర్యము ముందువెన్కల నభాండ మ్మేమి రానున్నదో !

అనుకొంచుం జనుచుం భయంపడుచు "ధ్యానాతంక భీతాత్ముఁడై
కనలుంగొంచు శపించు పూని"యని శంకం గొంచు, వెన్వెంటనే
తనుదా ధైర్యముతోఁ "దపస్వి జనసత్కారమ్ముఁ గావించి పో
యిన దోసం బొకఁడుండఁబో" దని సమీపించెన్ మహాశ్వేతయున్.

వీరికిఁ గొంతదవ్వుగ "కపింజలుఁ" డన్మౌని - లేత వెన్నెలల్
దారములల్లుకొన్న వసితం గని ముంగల "పుండరీకుఁ" డోం
కారము మాని మేనఁ బులకల్ మొలకెత్తఁగ నుంటఁ గాంచి తా
త్పారము వీడి తత్క్షణమె దగ్గఱెఁ దత్తర మొంద నిర్వ్యయున్.

కొంచెము సేపు నాల్గువలఁకల్ దిలకించి కపింజలుండు ప్ర
శ్నించిన చూపుల న్విసరె ; స్వీయవిశేషముఁ దెల్పి శ్వేత "మీ
యంచితనామధేయముల యక్షరముల్ నునువింతవాసనల్
మించెడు పుష్పగాథ - యొలమిం దలపోసి వచింపుఁడా !" యనన్.

పుండరీకుని పూనముఁ బొలఁతి పొలుపుఁ
గని, కపింజలుం డిట్లుపక్రమణ చేసె-
"విని మిత్రుఁడ నేను కపింజలుండ ;
నన్నుఁ గూర్చి యీ మాత్రము విన్నఁజాలు.

కలఁడొక మహర్షి దేవలోకమున యందు
"శ్వేతకేతు" సమాఖ్యవిఖ్యాతుఁ డతఁడు ;
దేవదానవలోచ నేందిందిరములు
తత్పదాంబుజసంతతతత్పరములు.

ఒక్కదినమున నతఁడు పూజోపయోగి
కమలసంపాదనార్థమై యమరనదికి
నరుగ, వేయిరేకులు విచ్చి మరులుకొన్న
కనులతోఁ బద్మమందుండి కనియె "లక్ష్మి".

అతని యనుపమ సౌందర్య మానసొలుపఁ
దలఁపులోపల నుండెనుఁ దలుపుఁ దెఱచి

తత్క్షణమె లక్ష్మి కొమరుని తల్లి యయ్యె ;
వాఁడె యీ పుండరీక సద్బ్రహ్మచారి.

శ్వేతకేతువు చేతుల స్వీకరించి
పసిఁడి పొత్తిళ్ళ బాలు నీ మిసిమివయసు
దాఁకఁ గన్నుల వెన్నగా సాకినాఁడు ;
విద్యలం దెల్ల దక్షుఁ గావించినాఁడు.

బ్రహ్మచర్యవిరుద్ధప్రవర్తనముగఁ
బాలమున్నిటఁ బుట్టిన పారిజాత
సూన మది వీని చెవిలోన సురభిళించు ;
ఇంక నీ లతాంతకథ విన్పింతు వినుము.

నేఁటి వేఁకువ శివుని సన్నిధికి నేను
వచ్చువేళ నందనవనము పొంతమందు
మాకు సర్వవాసంతిసుశ్రీకమూర్తి
యామె "వనదేవి" యభివాద మాచరించి.

'మునికుమార ! నీ సౌందర్య మనుకరింపఁ
జేయు నీప్రసూనమ్ముఁ గైసేసికొమ్ము ;
నరుల కరుదైన దీని నాదరముగోడఁ
దాల్పు ప్రసవ జన్మమ్ము సార్థక్యమొంద'

అంచు మా పుండరీకున కర్పణమ్ము
చేసె ; ధర్మప్రతీపమా చేష్ట కింత
మాత్ర మిష్టపడఁడు కాని, మైత్రి నెంచి
యెడఁద నొచ్చునో యని సమ్మతించినాఁడు.''

అని కపింజలుండు వివరించునంతలో
''నింకయేల నీకు నిట్టెపున్న
విరిసి తెచ్చి నీదు పులందాఁ దుసిమనో ?''
అంచుఁ బుండరీకుఁ డట్లుచేసె.

పాలకడలి వీడి నీలికడలిపైని
చందమామ తేలు సొగసులుకఁ
బడఁతి కురులలోనఁ బారిజాతసుమమ్ము
వింత సోయగమ్ము వెల్వరించె.

ఆమె మేను దాకి యాకస్మికమ్ముగా
వదలుతన మొకండు పొదివికొనఁగ
నిలువు నిలువు క్రొత్తచెలువమ్ము పులకింప
నతఁడు జారవిడిచె నక్షమాల.

మాల జారకుండ మధ్యలో గ్రహియించి
తన గళమ్మునందుఁ దాల్చె నామె
వనుని బాహుయుగముఁ బరిరంభణము వేళఁ
గంఠమందుఁ దాల్చు కౌతుకమున.

అంతలోఁ బరిచారిక యాకసమ్ముఁ
జూచి "అమ్మ! అమ్మ యెవరు చూచుచుంద
రింటి కేగుట మంచిది; ఇంక జాగు
వలదు; పోద" మనుచు బలవంతపెట్టె.

చేయునది లేక యామహాశ్వేత యప్పు
డంపములఁ జోపుచూపు లందందుఁ బరపి
సెలవుఁగొని, అంకుశవశహస్తిని విధాన
బరువుగా సాగె నడుగులు వైచుకొనుచు.

"కనులు తెఱచియు నెదుటి సంగతిని గనని
దివ్యతాపసైకాగ్రశక్తికి నమోఽస్తు!
త్వత్కరాలంబ ముడిగి కృతఘ్న మాచు
లలన మెడనున్న యక్షమాలకు నమోఽస్తు!"
అని కపింజలుఁ డించుక యపహసింపఁ

తత్క్షణమె లక్ష్మి కొమరుని తల్లి యయ్యె;
వాఁడె యీ పుండరీక సద్బ్రహ్మచారి.

శ్వేతుకేతువు చేతుల స్వీకరించి
పసిఁడి పాత్రిళ్ళ బాలు నీ మిసిమివయసు
దాఁకఁ గన్నుల వెల్గుగా సాకినాఁడు;
విద్యలందెల్ల దక్షుఁ గావించినాఁడు.

బ్రహ్మచర్యవిరుద్ధప్రవర్తనముగఁ
బాలమున్నిటఁ బుట్టిన పారిజాత
సూన మది వీని చెవిలోన సురభిళించు;
ఇంక నీ లతాంతకథ విన్పింతు వినుము.

నేఁటి వేఁకువ శివుని సన్నిధికి నేగి
వచ్చువేళ నందనసముపాంతమందు
మాకు సర్వవాసంతసుశ్రీకమూర్తి
యొకచు "వనదేవి" యభివాద మాచరించి.

'మునికుమార! నీ సౌందర్య మినుమడింపఁ
జేయు నీప్రసూనమ్ముఁ గైసేసికొమ్ము;
నరుల కరుదైన దీని నాదరముతోడఁ
దాల్చు ప్రసవ జన్మమ్ము సార్థక్యమొంద'

అంచు మా పుండరీకున కర్పణమ్ము
చేసె; ధర్మప్రతీపమా చేష్ట కింత
మాత్ర మిష్టపడఁడు కాని, మైత్రి నెంచి
యెడఁద నొచ్చునో యని సమ్మతించినాఁడు."

అని కపింజలుండు వివరించునంతలో
"నింతయేల నీకు నిష్టమున్న
విరిని దెచ్చి నీదు కురులందుఁ దురుమనో!"
అంచుఁ బుండరీకుఁ డట్లుచేసె.

పాలకడలి వీడి నీలికడలిపైని
చందమామ తేలు సొగసులుకఁ
బడఁతి కుచులలోనఁ బారిజాతసుమమ్ము
వింత సోయగమ్ము వెల్వరించె.

ఆమె మేను దాకి యాకస్మికమ్ముగా
వదలుతన మొగంబు పొదివికొనఁగ
నిలువు నిలువు క్రొత్తగాలువమ్ము పులకింప
నతఁడు జారవిడిచె నక్షమాల.

మాల జారకుండ మధ్యలో గ్రహియించి
తన గళమ్మునందుఁ దాల్చె నామె
వసునిబాహుయుగముఁ బరిరంభణము వేళఁ
గంఠమందుఁ దాల్చు కౌతుకమున.

అంతలోఁ బరిచారిక యాకసమ్ముఁ
జూచి "అమ్మ! అమ్మ యెదురు చూచుచుండు
రింటి కేగుట మంచిది; ఇంక జాగు
వలదు; పోద" మనుచు బలవంతపెట్ట.

చేయునది లేక యామహాశ్వేత యప్పు
డంసములఁ జోపుచూపు లందందుఁ బరపి
సెలవుఁగొని, అంకుశవశహస్తిని విధాన
బరువుగా సాగె నడుగులు వైచుకొనుచు.

"కనులు తెఱచియు నెదుటి సంగతిని గనని
దివ్యతాపసశైత్యాగ్రశక్తికి జయమోఽస్తు!
త్వత్కరాలంబ ముడిగి కృతఘ్న మాచు
లలన మెడనున్న యక్షమాలకు నమోఽస్తు!"

అని కపింజలుఁ డించుక యపహసింపఁ

కొంచు, వెడనవ్వు నవ్వుచుఁ గించపడుచు,
జరిగిన దెఱింగి, కొంత ముందరికి వచ్చి-

కృత్రిమమైనకోపమునఁ గ్రీఁగెదవిన్ మునిపండ్ల నొక్కుచున్
నేత్రములందుఁ జెందిరము నెట్టెలు వారఁగఁ బారఁ జూచి "నీ
మైత్రి నెఱింగినాము ; మఱి మంచిది ; మాల నొసంగిపొమ్ము ; తా
పత్రయ మేల ? కాలు కదుపం జనదింక" నటంచుఁ బల్కఁగా.

ఆమె తన మెడలోని ముత్యాల మాల
తీసి, యతని యంగుళుల కందిచ్చునపుడు
సన్న వెన్నెల కిరువంక వన్నెలొలుకు
తెల్ల యెఱ్ఱఁగల్వలకు మైత్రిని ఘటించె.

పిదపఁ బరిచారికయు మహాశ్వేతయుఁ జని
నంతఁ బుండరీకుఁడు వలవంతఁ జిక్కి-
నాఁడు ; సఖు హార్దైన్యహైన్యము లరసి క
పింజలుండు మనస్సున బిట్టు వగచి -

"ఏమిసఖా ! ఇదేమి ? చదు వేమియు నీమముఁ గావలేదొ ? ని
ష్కామతపఃప్రభావపరికల్పితధైర్యము, బ్రహ్మచర్యమున్
గామిని ముందు నీకుఁ గొఱగానివొ ? శాంతిని వీడి సంతమ
స్తోమమునందుఁ జిక్కుకొనుచుంటివి చోద్యముకాదె ధాత్రిలో ?

అక్షమాలతోఁ బాటు నీ యంతరాత్మ
వనిత వెనువెంటఁ దగిలిపోయినది నిజము ;
ఇంక ముత్యాలమాల స్మృత్యంకమాచు
నిన్నుఁ గలఁచుటకె మిగిలి యున్న" దనియె.

ఇ ది

దర్శనము.

## శ్రీమద్రామాయణము - మానవత్వప్రతిష్ఠ

# పుత్రకామేష్టి

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

"న్యగ్రోధోదుంబరోఽశ్వత్థ శ్చాణూరాంధ్రనిషూదనః" అని శ్రీకృష్ణుఁడు చాణూరుని సంహరించినట్లు దెలియుచున్నది. ఈ తీరున నాంధ్ర, చోళ, పాండ్య, కర్ణాటాదిదేశములందు దస్యులు దాఁగి యనేకదుశ్చర్యల కప్పుడప్పుడు కడంగుచుండుట దశరథుఁ డెఱుంగని విషయము కాదు. నిజమున కీ ద్రావిడు లనునవనాగరిక రాక్షసజాతి హిందూదేశమునకు దక్షిణమునం దుండిన సుమత్రా, జావా, బోర్నియో, లంక మున్నగు ద్వీపములనుండి యరాజకముగను నరణ్యసీమగను నుండిన దక్షిణాపథమునందు నెలకొని యచ్చట నివసించుచుండిన శరభంగ, సుతీక్ష్ణ, మతంగాదిఋషులను జనస్థాననివాసులగు ప్రజలను బాధించుచు, వారి స్త్రీధనములను కొల్లగొట్టుచు ననేక ప్రమాదముల నిటీవల నీ దేశముపై దండెత్తిన ఘుజినీమహమ్మదు, ఘోరి, తైమూరు మున్నగు దుర్మార్గులవలె ననేకహింసాకాండములఁ గావించుట దశరథుఁ డెఱుంగని విషయము కాదు నేఁటివఱకు బాలీ దీవులను బలిచక్రవర్తిరాజ్య మని మనము వ్యవహరింపుచున్నాము. నేఁడు రామాయణమును దగులఁబెట్టుదు మనియు, రామవిగ్రహములను బాడుచేయుదుమనియుఁ జెప్పుచు దేశమునం దల్లకల్లోలములను రేఁపెడి దుర్మార్గులా సుమత్రా, జావా, బోర్నియో మున్నగు దీవుల నుండి యానాఁడే దేశమునకు వచ్చిచేరిన యనాగరికరాక్షసజాతుల సంతతి యని చెప్పవలసియున్నది. రావణుని కాలమునుండియు వారు శ్రీరామునిపైఁ బగఁగొనియే యుండిరి. ఆర్షవిజ్ఞానమునందలి రహస్య

రము వారు పూర్వవైరమును స్మరించుచు నేఁడు దక్షిణాపథమందు నివసించెడి యార్యసంతతి కనేకములైన యిక్కట్టులు దెచ్చుచున్నారు. కావున రామాయణకాలమునాఁడుగూడ ననేకవిషమపరిస్థితు లాఁనాటి ప్రభువులును మహర్షులును నెదుర్కొనవలసియుండెను. వాని నన్నిటిని గమనించుట ధర్మము. కావుననే దేశ మేమగునో యని పరితపించుచు, తనయనంతర మీ విశాలభరతవర్షమునందు వేదవిజ్ఞానము నశింపకుండఁ జేయఁగలిగిన పుత్రసంతానముకొఱకు దశరథుఁడు పరితపింపవలసివచ్చె ననుట చెప్పకదప్పదు. శ్రీరామచంద్రుఁడుగూడ యెంత తీక్ష్ణ దేశక్షేమాభిమానియో యాతఁడు రావణసంహారానంతరము సీతతో ననిన యీ క్రిందిమాటలవలన మనకు స్పష్టముగఁ దెలియఁగలదు :—

శ్లో॥ "నిర్జితా జీవలోకస్య తపసా భావితాత్మనా ।
అగస్త్యేన దురాధర్షా మునినా దక్షిణేవ దిక్ ॥"

శ్లో॥ "విదిత శ్చాస్తు తే భద్రే యోఽయం రణపరిశ్రమః ।
స తీర్ణ స్సుహృదాం వీర్యా న్న త్వదర్థం మయా కృతః ॥"

(6-118-14, 15)

దేశక్షేమమును దేశమునకు జీవగఱ్ఱ యగు సంస్కృతిక్షేమమును గోరకున్నచో నట్టిమానవుఁడు బుట్టినను జచ్చినట్టులేకదా! వేదవిజ్ఞానము నార్షసంస్కృతి లేనిచో నీ వట్టిమట్టి భారతవర్షము కాదని యీవఱకే పేర్కొనియుంటిని. ఇక్ష్వాకువంశస్థుల పరిపాలనా దీక్ష యెంత గాఢతరమయినదో మన మయోధ్యాకాండమును బూర్తిగఁ జదివినచో బోధపడఁగలదు. కావున నాత్మమృత్యుహేతువులైనను దేశక్షేమమును లోకక్షేమమును మనస్సునం దిడుకొని "తదర్థం హయమేధేన యక్ష్యేఽహం సుతకారణా"త్తని దశరథుఁడు సంకల్పించె ననుట చెప్పవలసియున్నది.

నాల్గవకారణముగూడ వాల్మీకి యూహించి తనతపశ్శక్తివలన నా దేవరహస్యమును దెలిసికొని దానిని రామాయణమునం దా కవి

పుంగవుఁడు పేర్కొనెను. శ్రీరామచారిత్రమును వాల్మీకి దైవమానుష
శక్తుల సమన్వయముగ రచించుట మనము గమనించుచున్నాము.
పైనఁ జెప్పఁబడిన మూఁడు ప్రధానకారణములేగాక మఱియొక దైవ
గోళసంపాదితవిషయముగూడ శ్రీరామావతారమునకుఁ గారణ
మయ్యెను. పౌరుషశక్తికి దైవశక్తి తోడ్పడినఁగాని కార్యసిద్ధి గాంచ
నేరదు. కావున నా దైవశక్తిసమన్వయమునుగూడ దిఙ్మాత్రముగ నిట
సూచించుచున్నాను. అందులకు ముందుగ శ్రీమద్రామాయణకర్తకు
దైవగోళసంజనితసంఘర్షణ మేరీతిని పొడగట్టె నని మనము ప్రశ్నింప
వచ్చును. నేఁటి ప్రకృతిశాస్త్రవేత్తలు తమదృష్టి నీ భౌతికప్రపంచ
మునందుమాత్రమె కేంద్రీకరించి యనేక ప్రకృతిరహస్యములను
భేదించి భేదించి తుద కణుశక్తిని గనుంగొని దానినుండి మానవవినాశ
హేతువు లగు యంత్రములను దయారుచేసికొనుచున్నటులనే మన
మహర్షు లీ సృష్టిరహస్యమును భేదించి యాధ్యాత్మికశక్తియే దీనికి
మూలమని నిర్ణయించి యా దైవశక్తిని సాధింపసమకట్టి యందుండి
యమృతత్వమును బడయఁగలిగిరి.

"However, the Mystery of our existence, the moral sufferings, the craving for the unknown, and the metaphysical phenomena appeared to our ancestors as more important than the bodily pain and dicease. The study of spiritual life and of philosophy attracted greater men than the study of medicine." అని Carrel పండితుఁడు వ్రాసెను.

మన మహర్షు లీ భౌతికప్రపంచమునందలి విశేషములను ముఖ్య
ముగా మానవుఁడు తరించుటకు వలయు విషయములనుమాత్రమె కని
పెట్టి యంతటిలోఁ దద్విమర్శనము చాలించి తమదృష్టి నాధ్యాత్మిక
శక్తులవైపు ద్రిప్పి మానవపరమార్థమును జేరుకొను సాధనములం దుత్తీ
ర్ణత జెందిరి. హిమవత్పర్వతమును జూడఁబోయిన ప్రవరాఖ్యునకుఁ
జూడఁజూడ పోవఁబోవఁ తుదకు వరూధిని ప్రత్యక్షమై మీఁద పడినటుల

నీ ప్రకృతియంతయుఁ జేయునట్టి దొక యద్భుతశక్తి కలదనియు నయ్యది విమర్శింపఁగడంగుచున్న కొలఁది నది కామిని యై మాయవృని పైఁ బడును గాని యాతని నీ సంసృతిబంధమునుండి పీడ్వడనీయదనియు మన ఋషి పుంగవులు గ్రహించి తమసృష్టి నీ ప్రాకృతశక్తివిమర్శనమునుండి యప్రాకృతశక్తివైభవమువైపు ద్రిప్పి యందలి చేపరహస్యములను దెలిసికొని వానియందుఁగూడ బద్ధులు గాక తుద కీశ్వరశక్తియే దీని కంతకును మూలమని నిశ్చయించి తాము తరించి లోకమును దరింపఁజేయ గలిగిరి. అట్టి యపూర్వవిమర్శనమునే వాల్మీకిఋషిపుంగవుఁడు శ్రీమద్రామాయణకావ్యమునందలి శ్రీరామచరిత్రమునం దోతప్రోతముగ మనకు నిరూపించియున్నాఁడు.

ఈసృష్టియందలి పిపీలికాదిబ్రహ్మపర్యంతము నణువు మొదలు మేరుపర్వతమువఱకును మంవాు ...వశక్తిని ...వస్వరూపమునుగూడ గుర్తించి ప్రతివిషయమునకును బవిత్రత నాపాదించి యుండిరి. అందులకు ముందుగ నీ విశ్వమున కుపాదానకారణ మగు ప్రకృతిని త్రిగుణాత్మకముగ విభాగించిరి. ఆ త్రిగుణాత్మకప్రకృతియం దీశ్వరచైతన్యశక్తి ప్రతిబింబితమై యందుండి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పుట్టిరనియు నందు రజోగుణాత్మకుఁ డగు బ్రహ్మనుండి యీ చరాచరభూతసృష్టి బయలు వెడలెననియు నిర్ణయించిరి. ఆతనినుండియె క్రమక్రమముగా దేవమనుష్యరాక్షసు లుత్పన్నమైనటుల మనకు సమస్తశాస్త్రములు తెలుపుచున్నవి. రామాయణమునందుగూడ-

శ్లో॥ అవ్యక్తప్రభవో బ్రహ్మ శాశ్వతో నిత్య అవ్యయః
తస్మా న్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యప స్సుతః॥

శ్లో॥ వివస్వాన్ కాశ్యపా జ్జజ్ఞే మను ర్వైవస్వత స్స్మృతః
మనుః ప్రజాపతిః పూర్వ మిక్ష్వాకు స్తు మనో స్సుతః॥

(1-70, 17, 18)

శ్లో॥ యస్యేయం ప్రథమం దత్తా సమృద్ధా మనునా మహీ
త మిక్ష్వాకు మయోధ్యాయాం రాజానం విద్ధిపూర్వకం॥
(2, 110, 7)

అని వసిష్ఠుండే భరతఖండ మేలీసన నిక్ష్వాకువంశస్థులకు సంక్రమించెనో చెప్పుటయేకాక మానవసృష్టి యేరీతిని జరిగెనోగూడ నిర్వచించెను. కావున నవ్యక్త మగు మూలప్రకృతినుండి యీశ్వరశక్తిచే నిర్మితమైన సత్త్వ, రజ, స్తమోగుణాత్మకమైన దైవమానవరాక్షస గుణము లుత్పన్నములైన వని మనకుఁ దెలియుచున్నది. సమస్త పదార్థజాతములుగూడ నీరీతిని నీ త్రిగుణాత్మక మగు ప్రకృతినుండియే యుత్పన్నము లగుచున్నటుల మనఋషులు విమర్శించి కనిపెట్టిన పరమార్థము. ఒక్కవస్తువునుండియే యీ యనంత మగు సృష్టియంతయు ననాది యగు కాలకర్మవిభాగముచేఁ బుట్టిన ట్లనేక సహస్రసంవత్సరములకుఁ బూర్వమే మన ఋషిపుంగవులు నిర్ణయించిరి. నేఁటి ప్రకృతి శాస్త్రవేత్తలు "యురేనియం" అను లోహములోని సగభాగము సీసముక్రింద మాఱుటకు నాలుగుకోట్ల యేబదిలక్షల సంవత్సరములు పట్టునని నిర్ణయించియున్నారు! అట్టి యనంతమగు కాలమునందలి శక్తిని తమ తమోగుణాత్మకకర్మశక్తి విజృంభణముచే నరికట్టుటకై యంత్రముల నిర్మించి వానిసహాయమున నా యణువును ఛేదింప సమకట్టి మానవకోటికి ముప్పు దెచ్చియున్నారు! అట్టివారి నేమనవలెను? ఆ రీతి పరమాణువులయందలి లక్షణాత్మకసాత్త్వికశక్తిని దమ తపోబలమున వశపఱచుకొని, దానిని చరు పురోడాశరూపమున నగ్నిహోత్రమునందు దేవతల కర్పించి యీ పంచభూతాత్మక మగు దైవగోళములం దుద్వేగ రహిత మగు సాత్త్వికశక్తిని సంఘటిత మొనరించి దానివలన మహత్తర వీర్యసంపన్నులైనట్టియు లోకకళ్యాణ మొనరింపజాలినట్టియు విలక్షణ మానవమూర్తుల నవతరింపజేయువారల నేమనవలయును? మొదటి వారిని రాక్షసు లనియు, నసురు లనియు, రెండవవారిని దేవత లనియు,

మహర్షు లనియు మనవారు పిలుచుట తప్పా? మనశాస్త్రములం దనేక స్థలముల నీ దైవాసురమనుష్యవిభాగములు సువిపులముగఁ జేసి యున్నారు. కాని శ్రీమద్రామాయణమునం దట్టి పాత్రలను మనకన్నులకుఁ గట్టియున్నాఁడు వాల్మీకి! అక్కాలమున నట్టి దైవ, మానవ, రాక్షసాంశసంభూతు లుండిరనుట మనకు దోఁపకమానదు. రాక్షసులు నాఁడు రావణప్రభుత్వమునందు విజృంభించి లోకమును బాధ సేయుచు, దేవతలను క్షోభ బెట్టుచు, సముద్రములను, వాయువునుగూడ విషపూరిత మొనరించుచు సర్వజీవహింసకులై చెలరేఁగియుండిరి. అట్టి దుర్మార్గు లగు రాక్షసుల యౌద్ధత్య మణంచుటకు మహర్షులు దేవతలు పూనుకొని రని మనకు వాల్మీకి చెప్పుచున్నాఁడు. వారు జగత్స్రష్ట యగు బ్రహ్మ నాశ్రయించి, యాతని ప్రబోధమువలన సర్వవ్యాపియై, యీ విశ్వపరిపాలనాదక్షుడైన విష్ణుని లోకమునం దవతరింపఁజేసె దేవ రహస్యమెఱింగిన యీ కవిబ్రహ్మ మనకు దెల్పెను! ఈమధ్యను వినోబా భావేగారు దక్షిణదేశమందు భూభిక్షకై పర్యటించుచు నచ్చటచ్చట శ్రీరామునిపటములను దగులఁబెట్టుటకై కొందఱు చేయునట్టి నీచతర ప్రయత్నములను జూచి శ్రీరాముఁడు చారిత్రాత్మక పురుషుఁడుగాఁ డనియు, రావణునకుఁ బదితల లుండుట యసంభవ మనియు, రెండు తల లున్న మానవులే లేకుండ నిఁక బదితలలు గల మానవు లెచ్చట నుండి వచ్చి రనియుఁ గావున శ్రీమద్రామాయణ మొక కల్పితగాథ యనియుఁ జెప్పినటుల పత్రికలలోఁ బ్రచారము చదివియుంటిని! నేడు మనదేశమునం దనేక ప్రముఖులు (Experts) అనేకవిధముల ప్రబోధములు సలుపుచున్నారు! "The more eminent the specialist the more dangerious he is" అని "Carrel" పండితుఁడు వ్రాసినటుల వినోబాగారికి రామాయణవిషయము తెలియకున్న చో నూరకున్న బాగుండును. నిజముగ రావణుఁడు పదిశిరస్సులతోఁ బుట్టలేదు. ఆతనికిఁ బదితలలు లేనేలేవు. కాని యాతని కింద్రజాలవిద్య బాగుగఁ

దెలియును. దానియం దాతఁడు చాల ప్రతిభాశాలి యగుటచేఁ దన యింద్రజాలశక్తిచే నాతఁడు పదితలలు వింశతిబాహువులు నున్నటుల చూపరులను దిగ్భ్రమ చెందించెడివాఁడు. ఈవిషయము శ్రీమద్రామాయణమునందు వాల్మీకి సీతాపహరణఘట్టమున వెలిబుచ్చియున్నాఁడు.

శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్
హస్తే హస్తం సమాహత్య చకార సుమహ ద్వపుః॥

(ఇచ్చట "ప్రతాప" శబ్దమునకు "ప్రభావ" మర్థము. "స ప్రతాపః ప్రభావశ్చ" అమరము.)

"కామరూపిణ మున్మత్తే! పశ్య మాం కామదం పతిం"

* * *

"క్రోధేన మహ తావిష్టో నీలజీమూతసన్నిభః"
"దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః" (3 49, 158)

అంతియగాని రావణునకు సహజముగఁ బదితలలుగాని యిరువది చేతులు గాని లేవు. ఇంద్రజాలమును జేయువారు చప్పట్లుచఱచుట, నెమలిపింఛమును ద్రిప్పుట, లేకున్న నొక యెముకనో మఱియొక వింత వస్తువునో చూపి మనల నేమరుపాటునకు దెచ్చుట లోకానుభవసిద్ధము. ఆంజనేయుఁడు రావణుని జూచినప్పుడును, రావణుఁడు నిద్రించునప్పుడును, రెండు బాహువులు, నొక్కతలమాత్రమే యున్నటుల వర్ణించినాఁడు వాల్మీకి. కావున వినోబాగారు లేనిపోని యవకతవక ప్రచారమునకుఁ గడంగకుందురుగాక. దక్షిణదేశమునందలి దుష్ప్రచార మీనాఁడుమాత్రమే పుట్టినదికాదు. శ్రీరాముని పటములను, శ్రీమద్రామాయణగ్రంథములను వారు విశేషధన మిచ్చి కొని తగులబెట్టినిండు. గాంధిగారు విదేశగుడ్డలఁ దగులబెట్టినంతమాత్రమున స్వరాజ్య మూడిపడినదా? శ్రీరాము డంతమాత్రమునఁ జచ్చు ననుకొనుట దుర్భ్రమ. ఇట్టి విపరీతోన్మత్తచేష్టలచేఁ గంసుఁడు సపరివారముగఁ జచ్చెనే కాని

శ్రీకృష్ణభగవానుని నఖాగ్రమునకుఁగూడ వేదన కలుగలేదు! అంత మాత్రమున నా యున్మత్తులకు వివేకము కలుగఁజేయ భావేగా రీ రీతిగ జారిత్రాత్మకపురుషుఁ డగు శ్రీరాముని మిథ్యావ్యక్తిగఁ బ్రచార మొనరింప సమకట్టుట హాస్యాస్పదము!

"Thus, great men, in speaking about things they do not thoroughly under stand, hinder humen progress in one of its fields, while having contributed to its advancement in another." అని Carrel మహాశయుఁడు చాటుచున్నాఁడు! విషయమునుఁ బూర్తిగ గ్రహింపనివారు ప్రచారమునకుఁ గడంగిన వో దానివలన ననేకానర్థములు వాటిల్లఁ గల వని పైదాని యభిప్రాయము. "చారిత్రేణ చ కో యుక్తః" అని వాల్మీకి నారదుని బ్రశ్నించె నని తొలుతనే మనవి చేసియున్నాను. రాక్షసుల బాధ యీ యార్యావర్తమునకుఁ జిరకాలమునుండియుఁ గలుగుచునే యున్నది. అట్టి దుష్టులఁ గాంచియే ఆంజనేయులు:-

శ్లో॥ న సామ రక్షస్సు గుణాయ కల్పతే
న దాన మర్థోపచితేషు యుజ్యతే
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమ స్త్వేవ మమేహ రోచతే॥ (5-41-3)

అని బల్రప్రయోగ మొనరించినవిషయము భావేగారు గ్రహింతురుగాక! కాలము సన్నిహిత మైనతఱి వారి వారి దుర్మార్గతలే వారిని మట్టుపెట్టును. రావణ, కంస, శిశుపాలాదులకన్న నేఁటి ద్రవిడకజగంవారుద్ధతులు కారు.

ఈ రీతిగ మానవకోటులు దేవాసురమనుష్యాంశములచే నీ లోకమునందు సంచరించుచుందు రనుట లోక, శాస్త్ర, సాంప్రదాయ సిద్ధములు. దేవత లనఁగా నీ సృష్టిరహస్యమును గ్రహించి ప్రతి వస్తు సముదాయమునకు నెట్టి యాపాటము జరుగకుండ నీశ్వరసృష్టికి వ్యతిరేకప్రవర్తనము చేయక విశ్వమేకాత్మకముగ గ్రహించి జీవయాత్రను

సాగించుకొని మానవజన్మపరమావధి చేరుకొనునట్టి దైవాంశసంభూతులు. "పుణ్యపాపాభ్యాం మనుష్యాః", యనుటచే నొకప్పుడు సాత్విక ప్రవృత్తి కలిగి యెట్టి యుద్వేజకకృత్యముల నొనరింపక తమజీవితమును నడిపించుకొనుచు వేఱొకప్పుడు కామద్వేషాదులకు లోనై తమ భోగములకొఱకుఁగాని, లేక తమ కంతరాయము కలుగు నను నహంకారముచేఁగాని ప్రబోధితులై లోకమునందుఁ గొంత దుష్టసంచలనమును గలుగఁజేయుచు, నందువలనఁ గలిగెడి సుఖదుఃఖముల ననుభవించెడి వారు మనుష్యులు. ఇఁక రాక్షసు లన్ననో యెట్టులైన నీ సృష్టిలోని భోగముల నెల్ల కైవసముచేసికొని తామె యనుభవింపవలె నను రాజస తామసప్రవృత్తి కలిగి, లోకోద్వేజకరములగు కృత్యములకుఁ గడంగి తమక్షేమమునుమాత్రమే చూచుకొని యితరులను హింసించువారు రాక్షసులని మనపూర్వులు విభాగించిరి. ఈ త్రివిధవిభాగములను రామాయణమునందు మనకు వాల్మీకి ప్రత్యక్షముగ నిరూపించి యాయా పాత్రలను మనముందుంచియున్నాఁడు. మనుజుఁ డాతీరున నిటు దైవసంపత్తునకు నటు లాసురసంపత్తునకును మధ్యవర్తియై తన విజ్ఞానాభివృద్ధిచే దేవత యగుచు, నజ్ఞానముచే నాసురయోనియందుఁ గూలుచుండుట తటస్థించుచున్నది. మన మీతీరున విభాగమును బాగుగ గుర్తించినంగాని శ్రీవిష్ణుఁ డేరీతి మానవజన్మ మంగీకరించెనో మనకు బోధపడదు. అటుల మనుజుఁడై యాతఁ డవతరించియే నాటి మనుష్యులకుఁ దనసత్ప్రవర్తనముచే మార్గదర్శకుఁ డయ్యెను. రాముఁడు దేవుఁడే యైనచోఁ దా నెటుల మానవమాత్రుల కాదర్శము కాఁగలఁడు? అదియే శ్రీమద్రామాయణమునందలి మానవత్వపరాకాష్ఠ లేదా ప్రహ్లాదుఁడుగూడ నీ తీరున మానవ, రాక్షస, సముద్ధరణ మొనరింపమని శ్రీ నృసింహమూర్తిని వేడుకొనెను :—

శ్లో॥ "నైవోఽద్విజే భవదురత్యయవైతరణ్యా ।
త్వద్వీర్యగాయనమహామృతమగ్నచిత్తః ।

శోచే తతో విముఖచేతస ఇంద్రియార్థ।
మాయాసుఖాయ భర ముద్వహతో విమూఢాన్ ॥

(శ్రీమద్భాగవతము)

కావున దేవతలు మానవులను దమవైపునకు ద్రిప్పుకొనుటకై వారిమధ్యను ఋష్యాదిపుణ్య పురుషరూపమున నవతరింతురు. రాక్షసులు గూడ "రాక్షసాః కలి మాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు" అను న్యాయమున రావణబ్రహ్మాదులవలె మానవులై పుట్టి మనుష్యులను దమవంకకు ద్రిప్పుకొనఁజూచుచుందురు. ఇట్టి ప్రయత్నములచేఁ బుట్టిన యుద్ధములే రామాయణ, భారతాదులందు వర్ణింపఁబడినవి. మనుజు లిట్టి మాధ్యస్థు లగుటచేతనే వారిని సులభముగఁ దన మాయోపాయములచే ననేకభోగములను గల్పించి వారిని దనవంకకు సులభముగ ద్రిప్పుకొనవచ్చునని రావణుఁ డూహించి బ్రహ్మను వరములు వేఁడునప్పుడు మనుష్యులను నిర్లక్ష్యముచేసెను ! మానవులే కాదు దేవతలు గూడ భోగవశు లగుట జగద్విదితము. దేవతలు భోగపరవశులైనతఱి, వారు శాపదగ్ధులై పతనము పొందుచువచ్చిరి. మానవులు కామపరవశులైనతఱి దుర్యోధనాదులవలెను సింహబలుఁడు, కార్తవీర్యాదులవలెను ఘోరముగఁ జచ్చిరి. ఇఁక రాక్షసులు ఘోరమృత్యువుల పాల్పడి రని వేఱుగఁ జెప్పవలెనా ? వేలకొలఁది మృగములను భక్షించి కడవలకొలఁది కల్లు ద్రావిన కుంభకర్ణునిమృతిని మనము రామాయణమునందుఁ జదివినచో రాక్షసులే తీరున మృత్యువుచే గ్రసింపఁబడుదురో మనకుఁ దెలియఁగలదు ! కావునఁ గేవలకామవశుఁడుగాక, విశుద్ధమగు వంశమునందు జన్మించి వేదవిహితధర్మానుష్ఠానమునం దప్రమత్తుఁడై చిరకాల మీ భూమండలమునందలి మానవులచే సత్కర్మానుష్ఠానము నొనరింపఁజేసిన ప్రతిభాశాలి దశరథుఁ డగుటచే యాతని వలనఁ దమకుఁ గార్యసాధకుఁ డగు మానవోత్తముని బడయ మహాత్ములును దేవతలు నపేక్షించిరి.

## పాండురంగమాహాత్మ్యము

**శ్రీ సామవేదం శ్రీరామమూర్తి.**

చంద్రుని కిరణములనుండి ప్రకాశించుమంటలఁట ఇది వింత విషయము. ఆ మంటలచేఁ గలఁతనొందుటయేమి ? విరహిణీప్రసక్తి యిట లేదుకదా ? కలఁతనొంది యవమానపడుచున్నది కాంతిసమూహముకదా ? ఎవరి కాంతి ? ఎవరిని ? విష్ణుకాంతి యైనచోఁ జంద్రకాంతిచేఁ గలఁతనొందునా ? మరియు జ్వాలకీల శబ్దములు పర్యాయములు కానఁ బునరుక్తి యనివార్యముగదా ? వ్యర్థమనునట్లు గగనమున వ్యాపించినచో వర్ణనీయవస్తువులోని ఘనత యేమున్నది ? 'ధరాధో జగద్ధోరణిన్' అను మొత్తమునకుఁ గ్రిందిలోకమనుట సమంజసమా ? వ్యాఖ్యానము మూలముకంటె దురవగాహమైనది. పూర్వటీకనే వీరనుసరించిరి. ఇట్టి వ్యాఖ్యలచేఁ గవిహృదయము పాఠకులకెట్లందును ?

నాకుఁ దోఁచిన యర్థము మనవిచేయుదును. రాకాసుధాభాను = నిండుచంద్రునియొక్కయు, భాను = సూర్యునియొక్కయు, ఉజ్జ్వలజ్జ్వాల = (పైకిలేచు మంటలుగల) అగ్నియొక్కయు, కీలా + కుల = జ్వాలలసమూహమునకు (కీలాశబ్దము స్త్రీలింగమునఁ గూడఁ గలదు) ప్రౌఢరీఢాకృత్ = ఎక్కువ యవమానము కలిగించు,...... త్విట్ + ఓఘంబు = కాంతిసమూహము (విష్ణుదేహగతము), సూర్యచంద్రాగ్నులు ప్రసిద్ధతేజస్సులు. విష్ణుదేహకాంతి యీ మూఁడు తేజస్సులను మించుచున్నదని భావము. అమోఘంబుగాన్ అను పాఠము యుక్తము. మొక్కపోకుండ నని యర్థము. మేఘవీథిన్ = గగనమందును, ధరా + అధోజగత్ + ధోరణిన్ = భూమి పాతాళముల మార్గమున, విష్ణుదేహకాంతి ముల్లోకములను వ్యాపించెనని భావము. ఇంకొకవిషయము. మూలమునను, వ్యాఖ్యలోను త్విడోఘంబు అనియే

యున్నది. త్విట్ + ఓఘము = త్విడోఘము కాని త్విడౌఘము కానేరదు. పూర్వగ్రంథములోని తప్పునే వీరు గ్రహించిరి.

ఉజ్జ్వలజ్జ్వాల శబ్దము విశేషణముకదా ? అగ్నిపర్యాయముగాఁ బ్రయోగింపఁబడునా ? యని సందేహింపనక్కఱలేదు. విశేష్యప్రతిపత్తి కలుగునపుడు విశేషణమాత్రప్రయోగము యుక్తమే యని వామనుఁడు "కావ్యాలంకారసూత్రవృత్తి" 5వ యధికరణమున 10వ సూత్రమున వివరించి "నిధాన గర్భామివ సాగరాంబరామ్" "క్రుద్ధస్య తస్యాథ పురామరాతే ర్లలాటపట్టాదుదగాదుదర్చిః" మున్నగు ప్రయోగముల నిచ్చియున్నాఁడు. ఊర్ధ్వజ్వలనము అగ్నిలక్షణమే గావున ("ప్రసిద్ధ మూర్ధ్వజ్వలనం హవిర్భుజః, శిశుపాలవధము) ఉజ్జ్వలజ్జ్వాల శబ్దము చేతనే యగ్నిప్రతిపత్తి కలుగును కావున విశేష్యప్రయోగము లేకుండుట తప్పుగాదు. పై సంస్కృత ప్రయోగములలో "ఉదర్చిః" అగ్నివాచక మగుట గమనింపఁదగును. "భవవసోత్కీలంబు" అని యిందే (4–187) ప్రయోగింపఁబడెను. ఉత్కీల మనఁగా నగ్నియని వ్యాఖ్యానింపఁబడెను. "కోపన శాప సన్యశిఖి" యనునెడ 'కోపన' శబ్దమునకే దుర్వాసుఁడని యర్థము చెప్పక తప్పదు కదా? కాఁబట్టి "ఉజ్జ్వలజ్జ్వాల" పదమున కగ్ని యని యర్థము చెప్పుట నిర్బాధము. (2–57)

పుండరీకుఁడు విష్ణువును స్తుతించుపట్టున

సీ. తనివోక నీ చక్కఁదనము సంప్రేక్షింతు నీ యవధానంబు నెమ్మివిందు (4–92)

టీ. "నీ యవధానంబుల్ = నీ హెచ్చరికను-నిన్ను గూర్చిన ప్రసంగమును" అని వ్రాయఁబడెను. అవధాన మనఁగా హెచ్చరిక (ఏమఱుపాటులేమి) అది ప్రస్తుతానుగుణము కానందునఁ బ్రసంగ మని యర్థము వ్రాసిరి. దీనికీ యర్థము లేదు 'అనధానము' అని యుండవలయును. ప్రశస్తమగు పూర్వకృత్యము అని దీని యర్థము. నీ సత్కథలను విందునని భావము.

దేవప్రాసాదవర్ణనమున

వ. .....నవరత్నసానుప్రాయంబును . అంభ్రంకషంబునగు మహాప్రాసాదంబునందు......... (4-118)

టీ. "నవరత్నసానుప్రాయంబును = నవరత్నములప్రోఁగు అను కొండకు చరియవంటిదియు" నని వ్రాసిరి. ఇది మిక్కిలి యసమంజసము. 'ప్రోఁగు, కొండ, అను నర్థముల నిచ్చు పదములు మూలమున లేకున్నను శ్రమపడి యిట్లు వ్రాసిరి. "సానుప్రాయంబు = కొండచఱియను పోలినది" అను పూర్వ (లఘు) టీకను గ్రహించి వీరు దానిని విపులము చేసిరి. ఇట రెండువ్యాఖ్యలును జెడినవి. రత్నసానువనఁగా మేరుపర్వతము. "మేరు స్సుమేరు ర్హేమాద్రీరత్నసాను స్సురాలయః" అని యమరకోశము. క్రొత్తదైన మేరుపర్వతముతో సమాన మని పైదాని యర్థము.

శివుఁడు నారదునకు విష్ణుసేవాదులవలని ఫలము తెలుపు సందర్భమున

క. హరిసోపహారు లక్ష్
శ్యాదు లెవ్వారు చూతు రట్టివారలు సకలా
మరపూజ్యులు వా రందునఁ
బొరసిన పుణ్యము లగణ్యములు గుణజలధీ ! (4-128)

"సోపహారుల = కానుకతోఁగూడినవానిని (ఏదేని కానుకనిచ్చి హరిని జూడవలెనని భావము)" అని టీకలో వివరించిరి. ఇది యుచితముగా లేదు. నైవేద్యముతోఁ గూడినవానిసని యర్థము. విష్ణువునకు నివేదితమయిన పదార్థమును జూచుట గొప్ప సుకృతమనిభావము. నైవేద్యము చూచి తరించినవానికథ యిందే ముందుఁజెప్పఁబడినది. (చూడుడు 197, 198, 199 గద్య పద్యములు) అక్కడ వ్యాఖ్యలో "సోపహారంబగు = నైవేద్యముతో కూడిన" యని వ్రాయఁబడెను. పైదానికి నేను వ్రాసిన యర్థ మనుకూలమగును.

క. తీర్థమున నాడి బ్రహ్మ
భ్యర్థితలీలావతారు భక్తాధారున్
బార్థసఖుఁ గొల్వఁగల మో
క్షార్థులకున్ గలవు సచ్చిదానందంబుల్. (4-130)

టీకలో "బ్రహ్మాభ్యర్చిత లీలావతారున్=బ్రహ్మచేఁ బూజింపఁబడిన విలాసార్థపుటవతారము కలవానిని" అని యున్నది. అర్థము పొసగకుండుట యేగాక 'అభ్యర్చిత, అను పాఠమునఁ బ్రాస భంగము వాటిల్లును. బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడిన విలాసావతారము కలవానినని యర్థము సరిపోవును. వెనుక బ్రహ్మప్రార్థనచే విష్ణువు అవతరించెనని "ఆవాణీరమణుంను ప్రార్థనము సేయన్ దేవకీదేవియం, దావిర్భావము నొంది" అను పద్యమునఁ (4-126) జెప్పఁబడినది.

క. క్షణము క్షణార్ధంబైనఁ బ్రదీ
క్షణలలితంబగు పయోధిశయనువదన మీ
క్షణ మొనరించు కృతికి. ..... ... (4-133)

ఇందు మొదటిపాదమున గణభంగము. "క్షణము క్షణార్ధంబేఁ బ్రదీ, క్షణలలితంబగు" అని యుండఁదగును.

సుశీల కపటపటువగు కృష్ణుని శాహారనిమిత్తుడు సందర్భము—

చ. అనుటయు సంభ్రమంబడర నంగన .........

...అభినవౌదనంబొసఁగెఁ బూని తదాజ్ఞ నె శ్రావమూకుటన్

(4-173)

టీక- "శ్రావమూకుటన్ = గంజిమూకుటివంటి పాత్రమున-కంచమువంటి పాత్రమున" అని వ్రాసిరి. శ్రావమూఁకుడనఁగా గంజి మూఁకుడను నర్థ మెట్లువచ్చెను? ఈ పాఠము తప్పు. "శ్రాణమూఁకుటన్" అని యుండవలయును. శ్రాణయనఁగా గంజి. 'శ్రావ' శబ్దము లేదు. "యవాగూరుష్ణికా శ్రాణా" అని యమరకోశము. తత్సమమైన

'శ్రాణ' పదముతో 'మూఁకుటుక' అను దానికి సమాసము సాధువే. ఇది తెలియక వ్యాఖ్యాతలు 'గంజిమూకుటివంటి పాత్రమున' అని సందేహించుచున్నట్లు వ్రాసిరి.

ఇది ముద్రణదోషముగా భావింపవీలులేదు ఈపాఠము (శ్రావ మూకుటుక) వ్యాఖ్యాతలు సమ్మతించి గ్రహించినదే. శ్రీ వేంకటరమణయ్యగారు లోఁగడ 'భారతి'లో "నిఘంటువుల కెక్కని పదములు" అను శీర్షికతో నొక * వ్యాసమును ప్రకటించిరి. అందీపదమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"శ్రావమూకుడు

"గంజికొలఁకగు మూకుడు" (గంజిమూకుడు) అను నర్థమునఁ గల యీపదము నిఘంటువులలో లేదు.

రామకృష్ణుఁ డీపదమును

అనుటయు సంభ్రమంబడర నంగన తొల్లిటినాఁటి యామినిం
దనకని వండి డించుకొని నాథుఁడు పల్లియ కేగు నెంజలిం
దనికి భుజింపకున్కి భరితంబయి యట్టిగ నట్టుకట్టి రొయి
వ్వ నభినవౌదనంబొసఁగెఁ బూని తదాజ్ఞనె శ్రావమూకుటుక.

(పాండు. 4-173.)

అని యుపయోగించియున్నాఁడు."

(చూ—సర్వధారి వైశాఖ భారతి)

పైవ్రాతచే నీపదము వీ రంగీకరించి గ్రహించినదనుట స్పష్టము. ఇట్టి పదములు నిఘంటుకారులు గ్రహింపలేదని వీరు బాధనొందుచున్నారు.

సుశీలకు సాక్షాత్కరించిన కృష్ణుని వర్ణనము.

---

* ఆవ్యాసములోఁ గొన్ని పదములు (పాండురంగమాహాత్మ్యములోనివే) చూపి నిఘంటువులు గ్రహింపలేదని విమర్శించిరి. అం దొండురెండు దక్క మిగిలినవానిని నిఘంటువులు గ్రహింపనక్కఱలేదు. ఈవిషయము వేఱుగా విమర్శింపఁదగును.

సీ. నీలంబు భక్తానుకూలంబు హరిదంతచేలంబు నవనీతచోరమాది
మూలంబు......... (4-187)

ఈ సీసములోని కృష్ణవిశేషణములన్నియు లాంతములే. 'నవనీతచోర' మనునది యొకటియే రాంతముగానున్నది. 'నవనీతలోల' మను పాఠాంతరము చూపఁబడినది. అద్దానిని గ్రహించినచో నను ప్రాసాలంకారము పోషితమగుటయే గాక రలప్రాసము (ఇటఁ బ్రాస యతికాన) తప్పును. చక్కని పాఠమును గ్రిందికిఁద్రోసి యీ పాఠము నేల గ్రహించిరో తెలియకున్నది. పూర్వగ్రంథమునఁగూడ నిదియే యున్నది.

రత్నహారము నోటఁగల చిలుకను వర్ణించుపట్టున

మ. గుహమాతృస్ఫటికాక్షసూత్రము సితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటా
స్పృహఁ గైకొన్న శుకంబొ యేమఱుతఱిన్, జీరాడుపూవాఁగతో
బహిరుడ్డీనత నొడ్డి నిల్పు రతిరాట్పృష్ఠాశ్వమో నాఁగ న
మ్మహిళావిభ్రమకీర మొప్పు ముఖసీమాగామిముక్తాళియై. (4-236)

"జీరాడు పూవాఁగతో=వ్రేలాడుచున్న పూలగుత్తితో" అని టీక. ఇది యసంగతము. పూవాగె=పూలపగ్గము అని యర్థము చెప్ప నొప్పును. లేకున్నచో 'రతిరాట్పృష్ఠాశ్వమో నాఁగ, నను కల్పనలోని సొగసే చెడును. నోటినుండి వ్రేలాడు హారము పగ్గమువలెనున్నది. కీరము మన్మథుని గుఱ్ఱము (చిలుక) వలె నున్నదని కవి యాశయము. పుష్పబాణుని గుఱ్ఱముగాన దాని పగ్గము పూలపగ్గమగుట యుక్తమే. 'వాగె'కు గుత్తియను నర్థములేదు. ఆపదములో బిందువులేదు. వీరు దానిని సానుస్వారముగా గ్రహించుట చింత్యము.

చిలుకను వెన్నాడుచున్న హరిదాసి వక్షోజముపైనున్న నఖక్షతము చూచి చెలికత్తె లామెను బరిహాసమాడుట—

వ. .........బోటికత్తియ లుత్తుంగకుచోత్సంగసంతతకురంగ లాంఛనకళావలోకనంబున ముసిముసినగవులెగయ గోరువంక కాన వచ్చెంగాని కీరంబు దూరం బయ్యెఁగదే యని గర్భోక్తి వైదగ్ధ్యం గూడి యాడుచు...... (4-237)

టీ. "బోటికత్తియలు = ఆమెచెలులు, ఉత్తుంగ... ...నంబు నన్ = ఉన్నతమయిన కుచముల మీఁదిభాగమున వ్యాపింపఁజేయఁబడిన వెన్నెలఁబోలు చూపుచేత, నెఱయఁగ = వ్యాపింపఁగా, గోరువంక = ఒక పక్షి, నఖక్షతమును, గర్భోక్తి వైదగ్ధ్యంగూడి = అర్థాంతరముతోఁ గూడిన సుకుమారపద్ధతితోఁ గూడి" అని వ్రాసిరి. "కురంగలాంఛన కళాపదమునకు వెన్నెల యని యర్థము వ్రాసి దానిని బోలిన చూపు అనుట సమంజసము కాదు. నెలవంక యనఁగా నఖక్షత మనునర్థము ప్రసిద్ధము. దాని ననుసరించి కవి నఖక్షత మనుటకుఁ జంద్రకళ (కురంగలాంఛనకళ) యనెను. అది కన్పట్టుటచేతనే చెలులు ముసిముసి నవ్వులతో గోరువంక పదమును శ్లేషించి పరిహాసమాడుట యుపపన్న మైనది. తెలుఁగును సంస్కృతముగాను సంస్కృతమును దెలుఁగుగాను జేయునేర్పు తనకున్నట్లు కవి కృతిపతిచేఁ బలికించియున్నాఁడు. (చూ. 1-23) దాని కిది తార్కాణము. కావున 'కురంగలాంఛనకళావలోక నంబునన్=నఖక్షతదర్శనముచే, నని యర్థము చెప్పఁదగును.

పంజరమునుండి విముక్తమై యెగిరిపోవుచున్న చిలుకను వెంబ డించు హారిదాసిని వర్ణించుపట్టున—

తే. బంధనిర్ముక్త శుకసక్తభావ యగుచు
వల పరాశరసుతు చంద మధిగమించు
మించునవఁబోఁడి చందంబు.........(4-238)

"పరాశరసుతుఁడు=శుకుఁడు" అని టీక. ఇది ప్రామాదికము. వ్యాసుఁడనుట యుక్తము. విరక్తుఁడై పోవుచున్న శుకుని వ్యాసుఁడు వెంబడించుట పురాణప్రసిద్ధము.

ఒక బోయవాని క్రౌర్యమును, శౌర్యమును వర్ణించుట-

చ. కలఁ డొకబోయ తన్నికటకాననభూమి నతండు విల్లున
మ్ములు ధరియించి కల్మషసమూహము లెత్తిన మేనుఁబోలెఁ బే
రలుక వహించె నేని హృదయంబు గలంగు ధరాధరస్థలీ
నిలయవసత్కరీంద్రులకు నిక్కమ తక్క మృగంబు లోర్చునే.
(5-13)

"ధరాధరస్థలీనిలయవసత్కరీంద్రులకుఁ = కొండగుహాలయందు నివసించుచున్న యేనుఁగులకును" అని టీకలో నున్నది. ఇది సరికాదు. గుహాలను నర్థమిచ్చుపద మిందు లేదు. స్థలీనిలయపదముల కట్టియర్థము కల్పించిరనుకొన్నను బర్వతగుహాలలోని యేనుఁగులకే భయముగలుగును. మిగిలిన మృగము లోర్చునా యనుటలోని చమత్కారమేమి? ఏనుఁగులకంటె బలిష్ఠజంతువులు లేనిచో నట్లనుట యుక్తముకాని సింహాదు లుండఁగా నట్లనుటలోఁ గలవిశేషము కానరాదు. ధరాధర పదమునకుఁ బర్వతమని యర్థము వారు చెప్పిరి. ధరా + అధరస్థలీ నిలయ=భూమిక్రిందిప్రదేశ మనుగృహములలో; వసత్ =నివసించుచున్న; కరీంద్రులకుఁ=శ్రేష్ఠగజములకు ననుసర్థము యుక్తముగాఁ దోఁచుచున్నది. భూమి క్రిందనున్నవియు భూమినిమోయు బలసంపన్నములు నగు దిగ్గజముల హృదయములే కలఁతచెందును. భూమిపైనున్న లాఁతిమెకము లోర్వఁగలవా యనుట సొగసుగా నుండునుగదా?

క. లోనాలుగు వెలినాలుగు
నైన మహాద్వారభూము లపవర్గ శ్రీ
నీనఁగ నీ నగరార్ధకు
శ్రీనగరగణిత విభూతిఁ జెందు మునీంద్రా! (5-33)

"శ్రీనగరగణితవిభూతిన్=క్షేత్రముయొక్క గొప్పసంపదను" అని

మృగ్యమగుచున్నది. 'శ్రీసగరు' అని విడఁదీసినచో 'చెందుర్' అను క్రియకుఁ గర్తృపదము లభించి యర్థము స్పష్టముగా నుండును. అగణితశబ్దము గణితశబ్దముకంటె యుక్తతరము.

శివుఁడు కృష్ణమంత్రప్రభావము నారదునకుఁ దెలుపుచు రుక్మిణి కృష్ణోపదిష్టమంత్రప్రభావమునఁ బ్రద్యుమ్నుని గనె నని చెప్పుట-

ఉ. విన్ము మదీయనేత్రశిఖివేగమునన్ జముఁగూడఁ జన్నయ
మ్మన్మథుఁ డిందుబింబసుకుమారుఁడు భోజతనూజయందుఁ బు
ట్టె న్మధువైరి దెల్పిన కడిందిజపంబు నెపంబునన్ బున
ర్జన్మమునొందె రాగరససంపద పెంపు యువద్వయీమతిన్.

(5-124)

టీ. "మదీయ...... వేగమునన్ = నా మూడవకంటి యగ్ని వేగమున, ఇందు బింబసుకుమారుఁడు = చంద్రబింబమువలె చక్కని వాఁడు, భోజతనూజయందున్ = రుక్మిణియందు, కడిందిజపంబు నెపంబునన్ = గొప్పదైన జపకారణమున; రాగరససంపద పెంపు (నన్) = గొప్పదైన అనురాగసంపద, యువద్వయీమతిన్ = ఇద్దఱు యువకుల రీతిని-ప్రద్యుమ్న, సాంబరూపమున, పునర్జన్మమునొందెన్ = మరలఁ బుట్టెను" అని వ్రాసిరి.

ఈ వ్యాఖ్యనుబట్టి శివనేత్రాగ్నిదగ్ధుడైన మన్మథుఁడు కృష్ణోపదిష్ట మంత్రజపప్రభావమున రుక్మిణియందుఁ బ్రద్యుమ్న సాంబులరూపమునఁ బుట్టెనని తెల్లమగుచున్నది. ఇది మిక్కిలి యసమంజసమనక తీరదు. పద్యములో 'పుట్టెన్', పునర్జన్మమునొందె, నని యున్నదికదా? 'పుట్టెన్' అను పదమునకుఁ బైటీకనుబట్టి కర్తృత్వపదము మృగ్యము. మన్మథుడు కర్తయైనచోఁ 'పునర్జన్మమునొందెన్' అనుదానికిఁ గర్త యెవరు? ఇంకొకటి-'ప్రద్యుమ్నసాంబరూపమున' అని వ్రాసిరి. ఇది తప్పు. సాంబుఁడు జాంబవతి కొడుకు. రుక్మిణియందుఁ బుట్టెననుట పూర్వాపరగ్రంథ విరుద్ధము. మన్మథుఁడు ప్రద్యుమ్నుఁ డగుడయే

పురాణప్రసిద్ధము. తరువాతి రెండు పద్యములలోఁ బ్రద్యుమ్నుని (మన్మథుని) వర్ణనము కలదు. కాని సాంబుని ప్రసక్తి లేదు. మఱియు 'రాగ.....పెంపు' అనునది యెందును బొందకున్నది.

ఇందు ముఖ్యవాక్యములు రెండు కలవు. "విన్మ...నెపంబున నా" అనునంతవఱకు నొక వాక్యము. మిగిలినది వేఱొక వాక్యము. 'పుట్టెన్' అను క్రియకుఁ గర్త మన్మథుఁడు. 'పునర్జన్మము నొందె' ననుదానికిఁ గర్తృపదము 'రాగరససంపద పెంపు' రాగరససంపద పెంపు = అనురాగరససంపదయొక్క - యతిశయము - గాఢానురాగము - యువద్వయీమతిన్ = తరుణదంపతుల మనస్సున, పునర్జన్మమునొందెన్ = మరలఁ బుట్టెను అని యర్థము చెప్పిన యుక్తమనుకొందును. మన్మథుఁడు పుట్టెను గావునఁ దరుణమిథునహృదయములలో రాగోదయ మయ్యె నని భావము. 'యువన్' శబ్దము ఏకశేషవృత్త్యాశ్రయమున నట్టి యర్థమిచ్చుట పండితులకుఁ దెలియని దేకాదు. యువద్వయి యనఁగా నిద్దఱు యువకులను కొనుట వ్యాఖ్యానము చేయుటకుఁ గారణమై మూలభావమును దుర్బోధ మొనర్చెను.

బ్రహ్మవర్ణనమున-

తే. మొదలు నడుమును గడయు నేర్పడనివాని (5-174)

ఇందు యతి భంగపడినది. కావున నీపాఠము గ్రాహ్యముకాదు. పూర్వగ్రంథములో "కడయు నడుమును మొదలు నేర్పడనివాని" నని యున్నది. ఇదియే సాధుపాఠము గాన గ్రాహ్యము. నవ్యవ్యాఖ్యాతలు ఆదిమధ్యాంతముల క్రమరక్షణవ్యగ్రులై యతిభంగమును గుర్తింపక సాధుపాఠము నధఃకరించిరి.

అగస్త్యుఁడు తన శిష్యుఁడైన దయమునుపు నెడలఁగొట్టిన పట్టున-

క. తన యాజ్ఞఁ గూడ శతిధృతి
తన యామనిఁ గొనని వాతస .యాశయునిన్

మునుచట్టు వెడలనడిచెను
మునికనలి కఠోరవర్ణములఁ బలు కొలయన్. (5-179)

"చట్టున్=శిష్యుని ; మును=ముందుగా" నను టీక సరికాదు. 'మునుచట్టున్' సమస్తపదముగా గ్రహించి మొదటిశిష్యుని ననియర్థము చెప్పిన బాగుగానుండును. అయుతనియుతులలో నయుతుఁడు మొదటివాఁడు. ఇందే యింకొక్కపద్యము తరువాత (5-181) అయుతుఁడనుటకు 'మునుపటియాతఁడు' అని ప్రయోగింపఁబడెను. దానికి 'మొదటివాఁడు-అయుతుఁడు' అని వ్యాఖ్య చేయఁబడెను. వ్యర్థముగా 'మును' అను పదము (ఏపదమునుగూడ) రామకృష్ణుఁడు ప్రయోగింపఁడు. ముందుగా ననునర్థమున నీపదము వ్యర్థమనకతప్పదు. కాన మొదటి శిష్యుఁ డనునర్థమే యుక్తము.

గురునిచే వెడలఁగొట్టఁబడిన యయుతుఁడు విలపించుపట్టున—

సీ. ఉర్వీధరము లెక్కి యురుకనే కుచకుంభయుగ మొల్లఁగాక తా నురుకు మనిన
వాఁడి క్రొవ్విరులపై వ్రాలనే నిడుఁజూపువా లొల్లఁగాక తా వ్రాలు మనిన
మున్నీటి సుడివడి మునుఁగనే నతనాభిఁగన నొల్లఁగాక తా మునుఁగు మనిన
బెడఁగారు కాలాహిఁ దోడుకనే నూఁగారు తోడు నొల్లఁగాక తాఁ దోడుకు మనిన
.................................... (5-184)

ఇందు స్త్రీల యవయవముల కుపమానములగు వస్తువులనే గ్రహించి గురుని యాజ్ఞయైనచో వానివలనఁగలుగు మరణమునకైనను వెఱువనుగాని స్త్రీల సాంగత్యము నొల్లనని యయుతుఁ డనుకొనుట విషయము.

టీకలో "సుడిన్=అలయుండు.....(ఇచట చూపులకు, కత్తులకు బొడ్డునకు, అలస నూఁగారునకు, నల్లత్రాచునకు పోలిక)" అ

వ్రాయఁబడెను. ఇది సరికాదు. సుడియనఁగా జలావర్తముగాని అల కాదు. నీటిసుడికిని బొడ్డునకుఁ బోలికకలదు. కాని అలకును బొడ్డునకును బోలిక లేదు. అలలకును వళులకును బోలిక కవిసమయము.

అయుతుని తపోవర్ణనమున—

మ. సుమఃఖాంతఃకరణాంబు.

......తపంబొనర్చు జటిలవ్యాఘ్రుం బనాఘ్రూతపు
ష్పము చందం బగుమేన నూనునియమభ్రాష్ట్రాగ్నిఁ
ద్రుంగించుచున్. (5-186)

టీకలో "మేనన్=శరీరమున ; ఊను=వహించునట్టి ; నియమభ్రాష్ట్రాగ్నిన్=నియమము అను మంగలపునిప్పుచే ; త్రుంగించుచున్=నశింపఁజేయుచు" అని వ్రాసిరి. ఇది సమంజసముగాదు. 'త్రుంగించుచున్' అను క్రియకుఁ గర్మ మ్మృగ్యము. శరీరమున వహించుచున్న నిప్పుచే దేనిని నశింపఁజేయుచున్నట్లు ? శరీరము నేకదా ? అది మరల నధ్యాహార్యమగుచున్నది. కావున నిట మూలవ్యాఖ్యలు రెండును సరిగా లేవనవచ్చును. పూర్వగ్రంథములో "మేననూన నియమభ్రాష్ట్రాగ్ని" నవియున్నది. ఆ పాఠమే సాధువు. మేను=శరీరము ; అనూన=అధికమైన ; నియమభ్రాష్ట్రాగ్నిన్=నియమమనెడి మంగలపునిప్పుతో నని యర్థము ప్రసన్నముగా నుండును. త్రుంగించుచున్=నశింపఁజేయుచు ననునర్థము స్వరసముగా నుండదు, నాశమనఁగా రూపుమాయుట (నిర్మూలమగుట). తపింపఁజేయుచున్నాఁడని కవి తాత్పర్యము గాని బూదిచేయుచున్నాఁడనికాదు. భ్రాష్ట్రాగ్నియని యూరక ప్రయోగించెనా ? మంగలపు నిప్పుచే గింజ వేఁగును. అట్లే నియమములచే శరీరమును వేపు (తపింపఁజేయు) చున్నాఁడనుట. ఇట 'తగ్గించుచున్' అను పూర్వగ్రంథపాఠము పరిహరణీయము కాదేమో యనుకొందును.

లక్ష్మీదేవి రూపమునఁ దన తండ్రియగు సముద్రుని బోలినట్లు వర్ణించుపట్టున—

సీ. లలితకుంతల శైవలము ముఖైందవబింబ మధరాధరప్రవాళాంకురంబు॥
(5-270)

ఇ ట్లీపద్యమున సముద్రగత వస్తువులకును లక్ష్మి యవయవము లకును సామ్యము వర్ణింపఁబడెను. అన్ని విశేషణము లుభయపక్షము లందును వర్తించును.

టీకలో "ముఖైందవబింబము, మధురాధర ప్రవాళాంకురము" అని విడఁదీసిరి. ఈపద విభాగ మెట్లుచేయఁగలిగిరో వారికే తెలియ వలసిన విషయము. 'బింబము' అని విడఁదీయగా 'అధరాధరప్రవాళాం కురంబు' అనికదా మిగులును. ఇఁక దానియర్థ మెట్లువ్రాసిరో చూఁడుడు. "మధు......రంబు = (ల) పగటపు మొలకవంటి తియ్యని పెదవి కలది. (స) మధురాధరమువంటి పగడపుమొలక కలది." ఇట మూలము నిర్దుష్టముగనే యున్నది. కాని వ్యాఖ్య దోషభూయిష్టమైనది. దీనికి హేతువు పదచ్ఛేదములోనే తప్పుట. 'మధురాధర' యను విభాగమున యతిభంగ మింకొకదోషము.

అధరాధరప్రవాళాంకురంబు అను పదచ్ఛేదము యుక్తము. దాని యర్థము క్రింద వ్రాయుచున్నాను.

అధర మనఁగాఁ బెదవి. క్రిందిది, తక్కువది యను నర్థములు కలవు. అధర ధరము = క్రిందిపెదవి. (లక్ష్మీరూపము) పగడపుమొల కవంటి యధరోష్ఠము కలది. (సముద్రరూపము) అధరోష్ఠమైన పగ డపు మొలకకలది. లేదా వేఱొకరీతిగా జెప్పనగును.

(ల) అధరముకంటె (పెదవికంటె) నధరమైన (తక్కువదైన) పగ

(స) అధరము (పెదవి) అధరము (క్రిందిది, తక్కువది) గాఁగల పగడపుమొలక కలది. అధరోష్ఠమును మించిన పగడము కలదని భావము.

అధరాధరము లక్ష్మీపక్షమునఁ బంచమీతత్పురుషము. సము ద్రపక్షమున బహువ్రీహి. పై రెండువిధములయిన యర్థముల సామంజ స్యము సహృదయులు గ్రహింపకపోరు.

అయుతుఁడు పౌండరీక క్షేత్రమున నశ్వత్థవృక్షరూపముననున్న నృసింహస్వామిని దర్శించె ననుపట్టున-

క. అటఁజని వాఁ డు వృత్తరది
క్త్రటమునఁ గనుగొనియెఁ దరళతరతరుమూర్తిన్
బటునఖరశైత్యమున నా
రట ముడిపి సురారి నేలురసికు నృసింహున్. (5-273)

"తరళతరతరుమూర్తిన్ = ప్రకాశించువృక్షస్వరూపము కల వానిని" అని టీక. మూలమునుబట్టి వ్యాఖ్య సరిగానున్నట్లే. కాని యిది సరియగు పాఠము కాదనుకొందును. ఇది రావిచెట్టు రూపుతో నున్న నృసింహుని వర్ణనము. ఈవిషయము వ్యాఖ్యలోఁగూడ వివ రింపఁబడెను. కాని వృక్షరూపుఁ డనునపుడు ఏవృక్షమో చెప్పుట సహజము. రావిచెట్టునకు "చలదళ" మనుపేరు కలదు. "బోధిద్రుమ శ్చలదళః పిప్పలః కుంజరాశనః, అశ్వత్థే" అని యమరకోశము. 'చల దళ' మనుటకుఁ గవి 'తరళదళ' మని ప్రయోగించియుండుననుకొందును. అది యర్థముకాకయో ప్రమాదముననో లేఖకులు 'తరళతర' యని మార్చియుందురు. ఆ పాఠమునకే వ్యాఖ్యాత లర్థము వ్రాసిరి. రావి చెట్టునకీ యర్థమునిచ్చు పదముల నితఁడు ప్రయోగించియున్నాఁడు. 2-160 వ పద్యములో 'చలాదళాకృతిస్వీకృతిన్' అనియు, 4-213 వ పద్యములో 'చలపత్త్రస్థూలశాఖాశిఖన్' అనియుఁ బ్రయుక్తము.

# శివస్వరూపము

డాక్టరు,
వాసుదేవశరణ్ అగ్రవాల్,
M. A. Ph. D. D. Litt.

అనువక్త,
శ్రీ బొడ్డపాటి వెంకటసుబ్బారావు,
ఎం. ఏ.

పండితులదృష్టిలో మేఘదూతకావ్యముయొక్క సందర్భ మేదియైనను స్వయముగఁ గాళిదాసుమాత్ర మందు శివునిస్వరూపము నతి నిపుణముగ నిరూపించినాఁడు. ఉజ్జయినిలోని మహాకాళేశ్వరుని పుణ్యధామవర్ణనము కలదు. శివగణములు, శివుని నీలకంఠత్వము, అతని నృత్యము, అంతకుమున్న గజాసురత్వక్పరిధానము మున్నగునవి యుల్లేఖింపఁబడినవి. (మేఘ I 40) శంకరుని 'శూలి' యని పల్కుటచే నాతని త్రిశూలము సూచింపఁబడినది. చండీ, భవానీ, గౌరీ, నామములుకూడ నుదాహరింపఁబడినవి. శివుని యట్టహాసమును (మేఘ I 62) అతని జటాజూటమందలి కల్లోలతరంగిణి యగు జహ్నుకన్యను పార్వతీగంగల సపత్నీభావమును వర్ణింపబడినవి. (మేఘ I 54) శంభుని భుజంగములు, శివపార్వతుల విహారములు (మేఘ I 64) కుబేరునితోడి యతనిమైత్రి, శివునిగూర్చి కిన్నరుల యశోగానము, త్రిపురవిజయము, నాతని వృషభము మొదలగు నన్నిటివర్ణనయుఁ గలదు. శివుఁడు ముక్కంటివేల్పు (మేఘ I 56) అతని లలాటమందు విదియచంద్రుని కళ గలదు. (మేఘ I 59) మదను నతఁడు దగ్ధమొనరించివైచినాఁడు. అందుచే శివనివాసస్థాన మనఁ గామదేవుఁడు వెఱచును. దివ్యాంగనలకు దర్పణసదృశమైన, వెండికొండ యగు కైలాసపుటొడియందే యతల కాపురి యునికి. శివుఁడు పశుపతి (మేఘ I 60) అతని పాదపీఠమును బరిక్రమించియు, దర్శించియు శ్రద్ధాళువులైన భక్తులు స్థిరపదము-

అనఁగా, అనావృత్తి రూపమోక్షము (కుమార సం. VI) ను బడయఁగల్గుదురు. (మేఘ I 59) శివుని ప్రమథాదిగణముల స్థావరమగు కార్తికేయస్వామిని, ఆతని జననమునుగూర్చి కవి యుదాహరించినాఁడు. స్కందుఁ డను కార్తికేయుఁ డెవ్వఁడు? సూర్యునికన్నఁ బ్రభావశాలి యైన శివుని తేజ మగ్నినోటియందు సంచితమై కుమార రూపమును దాల్చినది. ("అత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః"- మేఘ I 47) కుమారుని నివాసస్థానము దేవగిరి. అచ్చటికిఁ బోయి పుష్పాకారముగ జలబిందువుల వర్షింపవలసిన దని యక్షుని యాదేశము. ఏల నన దేవాసురసంగ్రామమందు దేవసేనను రక్షించుటకే కుమారస్వామి జన్మించినాఁడు. కావునఁ బూజాంజలిని గ్రహించుట కతని కధికారము కలదు. కాళిదాసు స్కందుని మయూరమును గూడ స్మరించినాఁడు. భవాని యగు పార్వతి పుత్రప్రేమచేఁ గుమారుని వాహనమైన మయూరపు కాకపక్షములను కర్ణాలంకారములుగ ధరించును. అట్టి మయూరమునుగూడ నానందింపఁజేసి, నృత్యోన్ముఖముఁ జేయవలసిన దని మేఘునకు యక్షుని పరామర్శ. ఇవ్విధమున ననేకప్రకారముల వృషరాజకేతనుఁడైన శివునిస్వరూపమును గాళిదాసు మేఘదూతయందు నిర్దేశించెను. ఈ స్వరూపమును విస్తృతముగ విచారణ చేయవలసిన యావశ్యకత గలదు.

కవి యుద్దేశానుసారము మేఘుఁడు కామరూపుఁడు. శివుఁడు తనకోపానలముచేఁ గాముని భస్మావశేషునిగఁ జేసివైచెను. ఇవ్విధమునఁగూడ శివునకును, వృషాత్మక మేఘునకును ఘనిష్ఠసంబంధము గలదు. కాళిదాసుని సంపూర్ణ తత్వశాస్త్రము నిజమునకు శివస్వరూపముచాటుననే డాఁగియున్నది. శివుఁడు, పార్వతి, కుమారస్వామి రూపముల సూక్ష్మవిచారణ సల్పినచోఁ గేవలము కాళిదాసుని సిద్ధాంతములేగాక యుత్తర భారతీయ సాహిత్యసిద్ధాంతములనుగూడ సహాను

భూతిపూర్వకముగఁ దెలిపికొనఁగలము. అత్యుత్కృష్టమైన యద్వైత సిద్ధాంతములఁ బాటించువాఁడు కాళిదాసమహాకవి. వేదాంతప్రతిపాదితమైన బ్రహ్మపదార్థమునే శివుఁడనును. బ్రహ్మకు శివుఁడను పదము వేదములందుఁ గొన్నిస్థలముల ప్రయోగింపఁబడినది. "నమః శమ్భవే చ మయోభవే చ నమః శంకరాయ చ మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ" (యజు. 16-41)

ఇచట శివునకు శంభు, శంకర, మయస్కర, మయోభవ నామములు వచ్చినవి. శివుని యఖండస్థితిని గాళిదాసు విరామము లేకుండ స్తుతించెను. ఎవని యాత్మశక్తి తనగుణములతోఁ గూడుకొని ప్రకృతి నిర్మాణమందును, దానిని విసర్జించుటయందును బ్రవర్తించుచుండునో యా సర్వలోకాధిష్ఠాత యగు బ్రహ్మయే యవ్యాత్మ. అజ స్వయంభూఅష్టమూర్తి (రఘువంశము II ౩౫) భూతపతియైన మహేశ్వరుఁడు. శాకుంతలమందలి మంగళశ్లోకమునఁ గాళిదాసే యష్టస్వరూపముల స్తుతించెనో యవియే గీతయందును గలవు.

> భూమి రాపో ఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ
> అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥
>
> గీత VII 4

అనఁగా పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనము, బుద్ధి, అహంకార మనెడి యష్టరూపములతో నా ప్రకృతి విభక్తమైయున్నది యని స్వయంభూబ్రహ్మ. విష్ణువు, శివుఁడు అనెడు త్రిమూర్తుల యద్వైతభావమునుగూడఁ గవి ప్రతిపాదించినాఁడు. బ్రహ్మను వర్ణించుసమయమునఁ గవి శివ, బ్రహ్మ, విష్ణు భేదముల నేమాత్రమును బాటింపలేదు. (చూ. కుమారసంభవము II 4)

కాళిదాసుని వేదాంతమతమందుఁ గేవల మొక యఖండశుద్ధాద్వైతబ్రహ్మయే పరమతత్త్వము. అతని త్రిదేవస్తుతు లుపనిషత్తులవలె

నిర్భయముగను, రసవంతముగను బ్రహ్మను బ్రతిపాదించునట్టివియే. రఘువంశమందు దశమసర్గలో (16 నుండి 32 వఱకు) క్షీరసాగరమందు శేషశాయియు, అవాఙ్మానసగోచరుఁడు నగు శ్రీ మహావిష్ణువునకు నమస్కరించి, దేవతలు స్తుతించినట్లు వర్ణింపఁబడినది.

శివ, విష్ణు, బ్రహ్మలను విడివిడిగ వర్ణించిన ఘట్టములందుఁగూడఁ గాళిదాసుని రచనలం దన్యోన్యసంక్రాన్తభావములును, పదములును గానవచ్చుచున్నవి. కుమారసంభవమం దనేకశ్లోకములందు శివుని యద్వైతస్వరూపము గోచరించుచున్నది.

"కలితాన్యోన్యసామర్థ్యైః పృథివ్యాదిభి రాత్మభిః
యేనేదం ధ్రియతే విశ్వం ధుర్యై ర్యాన మివాధ్వని"
(కుమారసంభవము VI-76)

శివుఁడు విశ్వగురుఁడు (కు. సం. VI-83) విశ్వాత్ముఁడు (కు. సం. VI-88) త్రైలోక్యవంద్యుఁడు (కు. సం. VII-54) తమోవికారముచే ననపహతుఁడు (కు. సం. VII-43) ఆ శివుఁ డెవరిని స్తుతింపఁడు. అందఱు నతనినే స్తుతింతురు. అతఁ డెవరికిని నమస్కరింపఁడు. అందఱు నతనికే వందన మొనర్తురు (కు. సం. VI-43) అతఁడు జగత్తున కధ్యక్షుఁడు. మనోరథముల కవిషయమైనవాఁడు (కు. సం. VI-17) మనస్సుగాని, వాణిగాని, బుద్ధిగాని యతనిని జేరుటకు సమర్థములు గావు. అతని తత్త్వమును (మూలరూపమును) ఎవ్వ రెఱుఁగఁ గలరు?

"కిం యేన సృజసి వ్యక్త ముత యేన బిభర్షి తత్ ।
అథ విశ్వస్య సంహర్తా భాగః కతమ ఏష తే"
(కు. సం. VI-32)

బ్రహ్మయొక్క యద్వైతతత్త్వమును నిరూపించి కాళిదాసు ముందునకు సాగును. ఏ యనంతపురుషుఁడు లోకాంతరముల కధి

స్థాతయో యతఁడే మనయాత్మతత్త్వమందుఁ బ్రతిష్ఠితుఁడైయున్నాఁడు. గీతయందు దక్షుఁడని చెప్పఁబడినవానికిని ("అక్షరం పరమం బ్రహ్మ" గీత- VIII-3) హృదయస్థానమందున్న యాత్మేశ్వరునకు నేమియు భేదము లేదు. గీతయందలి క్షేత్ర, క్షేత్రజ్ఞవిచారము కాళిదాసునకు సమ్మతమే.

"ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర ఇత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్ర-క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్ మతం మమ"

(గీత XIII-1, 2)

(ఓ అర్జునా ! ఈ శరీరమునే క్షేత్ర మందురు. ఈక్షేత్రము నెవ్వఁ డెఱుఁగునో యతనినే శాస్త్ర మెఱిఁగినవారు క్షేత్రజ్ఞుఁ డందురు. ఓ భారతా ! సర్వక్షేత్రములందును నన్నే గుర్తింపుము. క్షేత్ర, క్షేత్రజ్ఞ మనెడి యేజ్ఞానము కలదో యది నన్నుఁగూర్చిన జ్ఞాన మని స్వీకరింపఁబడినది.)

గీతయందలి 'అక్షర, క్షేత్రజ్ఞ, తద్విద్' మొదలైన శబ్దములను గాళిదాసు గ్రహించినాఁడు.

"య మక్షరం క్షేత్రవిదో విదు స్త మాత్మాన
మాత్మ న్యవలోకయ న్తమ్ (కు. సం. III-50)
"యోగినో యం విచిన్వంతి క్షేత్రాభ్యంతరవర్తినమ్
అనావృత్తిమయం యస్య పద మాహు ర్మనీషిణః ॥

(కు. సం. VI-77)

భగవద్గీతయందుఁ బ్రతిపాదింపఁబడిన యోగసాధనమార్గమునే కాళిదాసుకూడ వర్ణించెను. యోగాభ్యాసి యగు పురుషుఁడు మిక్కిలి యెత్తును, మిక్కిలి పల్లమును గానట్టి పరిశుభ్రమైన స్థానమందు సుస్థి

రుండై యాసనమును గ్రహింపవలెను. ముందుగ దానిపై దర్భలను, అటుపైన మృగచర్మమును, బిమ్మట వస్త్రమును బఱచవలెను. అచట, చిత్తమును, ఇంద్రియవ్యాపారమును నిరోధించి, మనస్సు నేకాగ్రము చేసి యాసనమునఁ గూర్చుండి, ఆత్మశుద్ధికొఱకు యోగాభ్యాసము చేయవలెను. కాయమును-అనఁగా శరీరపు వెనుకభాగము లేక వెన్ను, శిరస్సు మెడను సమముగ నుంచి, దిక్కులం జూడక నాసికాగ్రభాగమున దృష్టిని నిలుపవలెను. గాలిలేనిచోటున నిలిపినదీప మెట్లు నిశ్చలముగ నుండునో యట్లే చిత్తము నుగ్గఁబట్టి యోగాభ్యాసము చేయు యోగి యుండునని (యుపమాసమన్వితముగ) చెప్పవచ్చును. యోగానుష్ఠానముచే నిరుద్ధమైన చిత్తము స్వయముగ నాత్మను జూచి తనలోఁ దాను సంతృప్తి నొందును. దీనిని గుమారసంభవముతోఁ బోల్చి చూడవలెను. (III-44 నుండి 50 వఱకు)

స దేవదారుద్రుమవేదికాయాం శార్దూలచర్మవ్యవధానవత్యామ్
ఆసీన మాసన్నశరీరపాత స్త్రియంబకం సంయమినం దదర్శ

పర్యంక బంధ స్థిర పూర్వకాయం,
ఋజ్వాయతం సన్నమితోభయాంసమ్
ఉత్తాన పాణిద్వయ సన్నివేశాత్
ప్రఫుల్లరాజీవ మివాంకమధ్యే
భుజంగమోన్నద్ధ జటాకలాపం
కర్ణావసక్తం ద్విగుణాక్షసూత్రమ్
కంఠప్రభాసంగ విశేషనీలాం
కృష్ణత్వచం గ్రంథిమతీం దధానమ్
కించిత్ప్రకాశ స్తిమితోగ్ర తారైః
భ్రూవిక్రియాయాం విరతప్రసంగైః
నేత్రైరవిస్పందిత పక్ష్మమాలై
ర్లక్ష్యీకృతఘ్రాణమధోమయూఖైః

అవృష్టి సంరంభ మివాంబువాహ
మపామివాధార మనుత్తరంగమ్
అంతశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాతనిష్కంప మివ ప్రదీపమ్
కపాలనేత్రాంతరలబ్ధమార్గై
ర్జ్యోతిః ప్రరోహై రుదితైః శిరస్తః
మృణాళ సూత్రాధిక సౌకుమార్యాం
బాలస్య లక్ష్మీం గ్లపయంత మిందోః
మనోనవద్వారనిషిద్ధవృత్తిం
హృది వ్యవస్థాప్య సమాధివశ్యమ్
య మక్షరక్షేత్రవిదో విదు స్త
మాత్మాన మాత్మ న్యవలోకయ న్తమ్ ॥
(కు. సం. III–44 నుండి 50 వఱకు)

దేవదారువృక్షముక్రింద నిర్మింపఁబడిన వేదికపైఁ బులిచర్మమును పఱచికొని, కూర్చుండి, సమాధినిష్ఠుఁడైన శివుని నాసన్నమృత్యు వగు మన్మథుఁడు చూచెను. శివుఁడు వీరాసనమునఁ గూర్చుండి, శరీరోర్ధ్వ భాగమును నిశ్చలముగ నుంచి, వెన్నెముకను నిట్టనిలువుగ నిలిపియుం డెను. అఱచేయిపై నఱచేయి యొడియం దిడుకొనియుండుటచే నంక మందు వికసించిన యెఱ్ఱతామరల ధరించినట్లుండెను. పాములచేఁ జుట్టఁ బడిన జడలును, కర్ణములనుండి రెండుపేరులు వ్రేలుచున్న రుద్రాక్ష లును, కంఠమందలి నీలవర్ణపుకాంతిచేఁ గలిసి నినుమడించిన కాంతిగల్గి కంఠస్థానమందు ముడిచే బిగింపఁబడిన లేడిచర్మమును ధరించి శంక రుఁడు, క్రిందివైపునకుఁ బ్రసరించుచున్న కాంతియు, మందప్రకాశము గల్గి నిశ్చలములైనట్టియు, భయమును గొల్పుచున్నట్టియు, కనుపాపలతో, కదలికలేని కనుఱెప్పలతో, రెప్పపాటులేని దృష్టితో నాసికాగ్రమును

జూచుచుండెను. వృష్టిసంక్షోభరహితమైన మేఘమువలెను, తరంగరహితమైన తటాకమువలెను ప్రాణాపానాదులగు శరీరమందలి వాయువులను నిరోధించి, పరమశివుఁడు నిష్కంపప్రదీపమువలె నుండెను. కపాలమందున్న నివృత్తిమార్గము ద్వారా లోనికిఁబ్రవేశించి, మస్తకోపరిభాగమందు బయల్వెడలుచున్న తేజఃకిరణములు మృణాళసూత్రములకన్నఁ గోమలముగనున్న చంద్రకాంతిని వెలవెలఁబాఱునట్లు చేయుచున్నవి. ఇట్లు ప్రణిధానముచే వశపఱచుకొనిన మనస్సును సమస్తేంద్రియవృత్తుల నుండి మఱల్చి హృదయస్థానమం దధిష్ఠింపఁజేసి క్షేత్రవిదులైనవారే

ద్వౌ విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥
(గీత 15-౧౬)

ఏపరమాత్మతత్త్వమును, కూటస్థబ్రహ్మ యందురో యట్టిదానిని నాత్మయందే దర్శించుచుండెను. శివ, విష్ణు, బ్రహ్మల యద్వైతభావము, శివుఁడు కూటస్థములగు నాత్మలు కలియుటయు, యోగముచే నాయక్షరబ్రహ్మను సాక్షాత్కరింపఁ జేసికొనుటయే కాళిదాసుని వేదాంత సిద్ధాంతము.

## శివుని మదనదహన రహస్యము

ఆత్మసాక్షాత్కారమందు నిమగ్నుఁడై యున్న శివుని యోగమార్గమునకుఁ గాముఁడు విఘ్న మాపాదించినాఁడు. ఆ కాముని పతిఁడు వశపఱచుకొనెను. జ్ఞానప్రాప్తికిఁ బూర్వము భగవానునకుఁగూడ నూరవిజయ మావశ్యకమైనది. శివునకుఁ గామునకు గాఢమైన సంబంధము కలదు. కామునకు "వృష" యను నామాంతరము కలదు. వృష శబ్దము నేత్రమునకుఁగూడఁ జెందును. మేఘుఁడే వృషయు ఇంద్రుని యొక్క కామరూపధారియగు ననుచరుఁడు. అనఁగా వృష, కామ మేఘము లొకతత్త్వముయొక్క నామాంతరములే. మేఘుని దూతగఁ

# ఆంధ్రప్రదేశావతరణము

# పండితసన్మానసందర్భోపన్యాసము 1956.

## కళాప్రపూర్ణ శ్రీవరులు చినసీతారామస్వామిశాస్త్రి.

"రహిం బుట్టు జంత్రగాత్రముల జాల్ గరంగించు, విమలగాంధర్వంబు విద్య మాకు" అనెడి యొక మహాకవిశిరోరత్నపు వాక్యము చొప్పున గాంధర్వవిద్యాప్రదర్శనమునకు ముందుగ నిసర్గకర్కశవచన రూపమగు వ్యాకరణశాస్త్రవిషయము నుపన్యసించి సభాసదుల మెప్పు గాంచుట వారి యాంధ్రభాషావిషయకాదరమున సుసంభవ మగునను విశ్వాసముతో నారంభించుచున్నాను. కావుననె యద్దానిని విస్తరింపక సంక్షేపించి యొక యాఱువిషయములుగ విన్నవించుచున్నాను.

1. తుంగభద్రాతీరపు ప్రభువులు మాంధ్రపండిత సన్మానములు.
2. ప్రాచీనాంధ్రుల పాండిత్యవైభవము.
3. నేఁటి విద్యాధ్యాపనపద్ధతుల విషయమునందలి నావిన్నపము
4. నేఁటి యుత్తమపట్టభద్రాదుల సంస్కృత ద్రావిడభాషల పరిచయము.
5. కళలనెడి సౌధమునకు శాస్త్రములు పునాదివంటివి.
6. ఆంధ్రులు సంకీర్ణజాతివారు కారు. ఆంధ్ర త్రిలింగశబ్దముల ప్రాచీనత. త్రిలింగమే తెలుంగు=తెనుంగు.

1. అదృష్టవశమున నీ నాఁటికి మనకు స్వరాజ్యము విశాలాంధ్ర రాష్ట్రమును లభించినవి. దేశాభివృద్ధికిని తన్మూలకభాషాభివృద్ధికిని, విశాలస్వరాజ్యమే మూల మనఁదగును. ఇట్టి యవసరమున దేశాభివృద్ధియుఁ దన్మూలక భాషాభివృద్ధియు మనకు హస్తగతములు. ప్రాచీన కాలమునాఁటి ప్రభుశేఖరులు ప్రజానురంజనమె కర్తవ్యముగా రాజ్యము చేయుచు దేశాభివృద్ధిని భాషాభివృద్ధిని గావించుచుండెడివారు. భోజుఁడు, రాజరాజనరేంద్రుఁడు కృష్ణదేవరాయలు మున్నగువా రిందులకు

దృష్టాంతము. శ్రీకృష్ణదేవరాయచక్రవర్తి రహాముక్తమాల్యదా మహా ప్రబంధమును రచించిన మహాకవి. ఆ గ్రంథ పీఠికలో నాతఁడు తానెన్నో సంస్కృతమహాకావ్యములను రచించియున్నట్లు ప్రసంగించెను. (చూ-ఆము ౧ ఆ ౧౩)

అట్లు వారు పండితులగుటచేతనే పండితకవులను గొప్పగా గౌరవించుచుండెడివారు. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్" అని కదా పెద్దలు చెప్పుదురు. ఆంధ్రకవితాపితామహుఁడు తన్ను శ్రీకృష్ణదేవరాయలు సన్మానించిన విధము నిట్లు వచించికొనెను.

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూఁత యిచ్చి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందికొనువేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
తగుదని తాన పాదమునఁ దొడిగె
గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె.

తే. గీ. ఆంధ్రకవితాపితామహ ! యల్లసాని । పెద్దనకవీంద్ర యని
నన్నుఁ బిలుచు ........ .......................

రామరాజభూషణుఁ డిట్లు తనకుఁ బ్రభువు చేసిన మన్ననలఁ గృతిభర్తచేఁ జెప్పించికొనెను.

శా. శ్రీరామాక్షితిపు న్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణుం బహు సంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాది స
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండ వీవన్నిటన్.

ఇట్లీ తుంగభద్రానదీతీరపురములలో నెందరెందఱో మహారాజు లెందఱి నెందఱినో పండితకవీంద్రులను సత్కరించిరి ఇట్టి పండితసభ్యపూర్ణమగు నాంధ్రప్రభుత్వమును "పండిత కళాకుశలుల" నేర్చి యూంధ్రుల నెందఱి నెందఱినో సత్కరించుచున్నారు.

2. శ్రీనాథుఁ డీక్రిందిరీతిని దన విద్యావైభవమును (సరస్వతీ ప్రార్థనరూపమున) బ్రసంగించెను.

సీ. దీనార టంకాలఁ దీర్థ మాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్ర భాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచు ఢక్కఁ
జంద్రశేఖరుక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

తే. గీ. మెట్లు మెప్పించెదో తల్లి యింక నన్ను
రావు సింగమహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ.

పయిరీతిగా నప్పటి కవులు సంస్కృతాంధ్రసాహిత్య విశారదులై శాస్త్రపండితులై, పండిత కవీంద్రు లనఁదగియుండెడివారు.

సీ. "పణినసూను కణాద బాదరాయణసూత్ర
ఫక్కి విద్వాంసు లుపన్యసింప"

(మనుచరిత్ర ౧ ఆ ౧౨) అని యిట్లు శ్రీకృష్ణదేవరాయల సభ కవిపితామహునిచే వర్ణితమయ్యెను.

గీ. "వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు"

(శృం. నై. ౨ ఆ ౪౯) అని యిట్లు హంసను మిషగాఁ జేసికొని శ్రీనాథుఁడు ప్రసంగించెను.

తే. గీ. ఆంధ్రదేశంబునం దొకకొందఱైన
నట్టి వ్యాకరణాది శాస్త్రార్థచణులు

కెలయువలదే మహాకవీంద్రులు నుద్యగ
సత్యసంపూర్ణ పాండిత్యశాలిఘనులు.

3. ఈ సందర్భమున నాంధ్రవిద్యావ్యాపన విషయమున నొక మనవి చేసికొనుచున్నాను. నేటి విద్యావిధానమున నింకను నాంగ్ల రాజ్యకాలికపద్ధతినే చాలవఱ కనుసరించుచు నాంగ్లభాషకును నాంగ్లమున రచింపఁబడిన కీ॥ శే॥ డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణాదికమునకును ప్రాధాన్యము నిచ్చుచు (డా. కాల్డువెల్లుగారు తమిళ ప్రామాణిక తొల్కాప్పియమును గర్ణాట ప్రామాణిక కర్ణాటభాషా భూషణాదికమును నన్నయాథర్వణకారికలను నెఱుంగరు. వారిగ్రంథము వ్యావహారిక భాషాప్రచురము మా. ద్రా. పరిశీ. VI పుట. ౫౬౯ పుట ౯౫ I విష. ౫౮౯ పుట ౧౦౦ I విష. ౬౧౨ పుట ౧౦౫ II విష. మొ॥) సంస్కృతభాషాజ్ఞానము సాధారణముగను, నాంధ్రభాషా వాఙ్మయ వ్యాకరణజ్ఞాన మత్యధికముగను మత్తమ పట్టభద్రులకును నుండునట్లుగఁ దెనుంగువిద్య గఱపఁబడుచున్నది. ఇట్టి పద్ధతిచొప్పునఁ దెల్గున నెన్నటికిని నన్నయాథర్వణ తిక్కన శ్రీనాథాదులవంటి పండితకవీంద్రులు సంభవింపనేరరు.

గ్రాంథికాంధ్రపండితుఁ డనిపించుకొనుటకు గ్రాంథికాంధ్ర సాహిత్య వ్యాకరణాదిప్రజ్ఞయు, సంస్కృతసాహిత్య వ్యాకరణ జ్ఞానసంపత్తియుఁ బ్రధానములుగా నుండవలయును. ఆపైని ద్రావిడభాషల పరిశీలనమును నాంగ్లభాషాజ్ఞానమును సామాన్యములై యుండవలయును.

సంస్కృత పరిచయము :—

4. పెక్కు రుపన్యాసకులు పండితులును "శతాబ్దము" తప్పు— 'శతాబ్ది' యొప్పు" అని తలంతురు. కాని "శతాబ్ది" "శతాబ్దము" అనునవి రెండును సాధువులె. "శతానా మబ్దానాం సమాహారః= శతాబ్దీ=శతాబ్ది" అని యిట్లు సమాహార ద్విగుపక్షమున 'శతాబ్ది' అనునది సాధు వగును. "శతావయవకః అబ్దః=శతాబ్దః=(శతాబ్దము)" అని

యిట్లు మధ్యమపదలోపి సమాసపక్షమున 'శతాబ్దము' అనునది సాధువగును.

నను త్రిలోకనాథః పితృసద్మగోచర ఇతి కథం కాళిదాస ప్రయోగః .......త్రయాణాం లోకానాం సమాహార ఇతి విగ్రహే 'తద్ధితార్థ......' ఇతి ద్విగుసమాసేతు 'ద్విగోః' ఇతి జీప్ప్రసఙ్గః. పాత్రాదిత్వాన్న స్త్రీత్వ మిత్యభ్యుపగమే "యది త్రిలోకీ గణనా పరా స్యాదిత్యాది ప్రయోగాః న యుజ్యేర న్నితిచేత్ సత్యమ్:–లోకశబ్దోఽత్ర లోకసముదాయపరః–త్ర్యవయవో లోక స్త్రిలోక ఇతి మధ్యమపదలోపీ సమాసః. ఏతచ్చ 'ద్విగో ర్లుగనపత్యే' ఇతి సూత్రే భాష్యే స్పష్టమ్" (సి–కౌ. ౭౨౭ సూ. బాలమనోరమా వ్యాఖ్య. తత్త్వబోధిని–౧౬౯ పుట). ఇట్లే "త్రిసంఖ్యాకాః పురుషాః=త్రిపురుషాః" అను విగ్రహము చొప్పున మధ్యమపదలోపి సమాసమున "త్రిపురుషాః" అను నన్నయ ప్రయోగము సాధు వగుచున్నది.

శ్లో. శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూర్త్తయ స్త్రిపురుషాః సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరాః శ్రేయసే॥

(భార–ఆది ౧ ఆ–౧ ప) (చూ. నా రచించిన యాంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము. విస్త II. ౨౯ IV విష).

ఇట్టి విషయములు సంస్కృత వ్యాకరణజ్ఞాన సంపన్నులకు మాత్రమె విదితము లగును గాని యింగ్లీషులోఁ వ్రాయఁబడిన సంస్కృత వ్యాకరణముల నప్రధానముగాఁ (Elementary) జదివినవారికిఁ దెలియఁజాలవు.

ఇంక నాంధ్రేతర ద్రావిడభాషలు:– తెలుఁగు, ద్రావిడభాషల కుటుంబములోని దగుటచేత నితర ద్రావిడభాషల జ్ఞాన మాంధ్రవిద్యార్థుల కత్యవశ్యకము. కాని నేఁ డట్టి యితరద్రావిడభాషల జ్ఞానము గల్గుటకయి యాధునికవ్యావహారికభాషలు చాలవనియు మూలముగాఁ

గల డా. కాల్డువెల్లుగారి ద్రావిడవ్యాకరణమును, దదనుయాయి గ్రంథములును బఠనీయములై యున్నవి. ఇది కేవలము నపమార్గము. ద్రావిడభాషలపరస్పరసంబంధము ప్రాచీన ద్రావిడభాషలలో నధికముగాఁ జూపట్టును. కాన నట్టి ప్రాచీన ద్రావిడభాషల స్వరూపమును దెలిసికొనుటకు లభించినంతవఱకైనఁ బ్రాచీన ద్రావిడభాషల వ్యాకరణములగు "తొల్కాప్పియము- కర్ణాటభాషాభూషణము- నన్నయాంధ్రశబ్దచింతామణి కారికలు మున్నగువానిసారము చదువవలయును. అట్టివానిలో నొక్కటయిన నుత్తమపట్టభద్రులకును బఠనీయము కాదు. మఱియు డా. కాల్డువెల్లుగారును నట్టివాని నెఱుంగనైన నెఱుంగరు. (చూ. ద్రావిడభాషాపరిశీలనము VI పుట, శ్రీ విద్వాన్ వే. వేంకటరాజులు రెడ్డి మహాశయుల యుపోద్ఘాతము. కాల్డు-పీఠిక ౨ పుట). పయికారణములచేత మనవారు ద్రావిడభాషల విషయమున డా. కాల్డువెల్లుగారి మాటలనె సాధారణముగాఁ బ్రతిధ్వనించుచుందురు. కాల్డువెల్లును నవరించి రా ప్రామాదికముగనె యుండును.

డా. కాల్డువెల్లుగారు ద్రావిడభాషలలో యత్తచ్ఛబ్దాన్వయము లేదనఁగా మనవారును నట్లె వ్రాసిరి. కాని తొల్కాప్పియమునందె యత్తచ్ఛబ్దాన్వయఘటిత సూత్రములు గలవు. ద్రావిడభాషలలోఁ దొల్కాప్పియముకన్నఁ బ్రాచీనమగు గ్రంథము లేనేలేదు గదా. (ద్రా. పరిశీ. ౧౧౮ IV విష. ౭౪౩ పుట). (కాల్డు ౪౩౬ పుట). (ఆం-భా-వికా-౪౯౪ పుట). (యత్తచ్ఛబ్దాన్వయ ఘటిత తొల్కాప్పియ సూత్రములు:- ద్రా-పరి ౭౪౬ పుట-తొల్కా-౫౧౮ సూ. పొరుళధికారము ౨౧ సూ.)

డా. కాల్డువెల్లుగారు ద్రావిడభాషలోని కన్నడమున వర్తమానార్థక శత్రంతములు (మాడుతె-మాడుతుం-మొ) తెల్గురూపముల (చేయుచున్) వంటివె యనఁగా మనవారు నట్లె వ్రాసిరి. (ఆం-భా-వి ౫౮౪ పుట). (ద్రా-పరిశీ-౮౩౬ పుట). శత్రంతములు-విశేషణములు. 'చేయుచున్' మున్నగునవి యవ్యయములు.

డా. కాల్డువెల్లుగారు కన్నడ వర్తమానార్థ సమాపకక్రియలోని (మాడిదపెం=చేయుచున్నాను) 'దప' ప్రత్యయములో 'ఆగు' ధాతుస్థితి (ఆగు = అహు = ఆప) గలదనఁగా మనవారును నట్లె వ్రాసిరి. (స్టడీస్ - ఇన్ - ద్రవిడియన్ ఫిలాలజీ-23 పుట). (ఆం-భా-షి ౫౩౨-౫౩౫ పుటలు). (ద్రా. పరిశీ. ౨౪౭-౨౪౮ పుటలు. ౧౩౦ II- విష). (కాల్డు-౪౬౦-౪౬౧ పుటలు).

డా. కాల్డువెల్లుగారు కర్ణాటమునకు సాధారణముగా హొసగన్నడమునె (నవీనకన్నడము) యుదాహరించును. దీనినిబట్టి వీరికిఁ బ్రాచీన కర్ణాటము బొత్తిగా ననభ్యస్తమని తోఁచును. దాని ననుసరించి మనవారును 'అనను' అనెడి హొసగన్నడరూపమునుండి 'అవన్' అను ప్రాచీనరూప మవతరించె నని వ్రాసిరి. డా. కాల్డువెల్లుగారు 'అవన్' మున్నగువాని తుది నకారమును 'డ' కారము వెంబడించు ననగాఁ మనవారును నట్లె 'వాండు' మున్నగు వానిని సాధించిరి-అవను=అవన్=అవన్ + డ్=అవన్డు=వాణ్డు-వాఁడు- మొ.

(కాల్డు-౨౨౭ పుట. III ముద్రణ చూ-ద్రా-పరి ౩౬౫ పుట. చూ-స్టడీ. ద్రవి-౬౪ పుట మొ. ౯౬వ).

డా. కాల్డువెల్లుగారు నకార రేఫల సంయోగమున వాని నడుమ 'డ'కార మవతరించునని యేవో శబ్దముల వ్యుత్పత్తికై వ్రాయఁగా (కాల్డు ౧౪౫=౧౪౬ పు). నాపద్ధతి నాధారముగాఁ గొని కావలయును 'వాఁడు-సత్యాదిత్యుండు' మున్నగువానిలోని ప్రసిద్ధమగు 'డుజ్' ప్రత్యయపు చరిత్రను విషయమున వింతవింతలగు నూహములను గావించిరి. "అవన్ + రు=అవన్ + ఉ=వాన్డు = వాన్ + డ్ + రు = వాణ్డు=వాండు=వాఁడు" "సత్యాదిత్యన్ + రు =సత్యాదిత్యన్డు=సత్యాదిత్యన్ + డ్ + రు=సత్యాదిత్యణ్డు=సత్యాదిత్యుండు" అను క్రమమున 'డుజ్' ప్రత్యయపు చరిత్రమును జూపిరి. పయి ప్రదర్శనములోని మొట్టమొదటి 'రు' అనునది ద్రావిడ పూజార్థక బహువచనమట! కాలక్రమమున వ్యవహర్తలు దానిలోని బహుత్వమును మఱచిరట! అందలి యా

'రు' వర్ణకము శకటముగా నేర్పడెనఁట- 'రఱ' ల తబ్బిబ్బులు ప్రాచీన కాలమందుమ నుండెడివఁట. తొల్కాప్పియము సూత్రముల (తొల్కా-౯౧-౯౪-౯౫) కదియె యర్థమఁట. అట్టి శకటముతోఁ బ్రాచీనశాసనములందు 'వాన్ఱు-(వాఁడు) సత్యాదిత్యన్ఱు' (సత్యాదిత్యుఁడు) అను రీతిని గన్పట్టుచున్నవఁట. ఆ 'ఱ' కారము 'రే' ఫముగా మాఱి వాని నడుమ 'డ' కార మవతరించెనఁట ! పిదప వ్యవహర్తలందలి 'రు' అను నది బహువచన ప్రత్యయమని తెలిసి దానిని దొలఁగించుటచేత "వాణ్డు-సత్యాదిత్యణ్డు" మున్నగు రూపము లేర్పడెనఁట ! ఆంధ్ర ప్రపంచములోని 'డు' వంతముల 'డుఙ్ఙు' లెల్లఁ బైరీతిని పూజార్థక 'రు' ప్రత్యయమూలకములె యఁట. (ఆం - భా - వి - ౩౭౭ -౩౭౭ పుటలు-౩౪౭ పుట). (ద్రా. పరి-౭౪-౭౫ పుటలు).

ప్రాచీనకాలమున 'ఱ' కారము 'ట-త' లకు సన్నిహితమగు నుచ్చారణము గల్గి యుండెడిది. (తొల్కా-౯౧-౯౪-౯౫ సూ.) కావునఁ బ్రాచీనకాలమున 'ర-ఱ' లెంతమాత్రమును దబ్బిబ్బు పడనే రవు. తొల్కాప్పియ సూత్రముల కది యర్థముకాదు. (చూ-ద్రా-పరి ౭౫ పుట) 'వాన్ఱు-సత్యాదిత్యన్ఱు' మున్నగువానిలోని తుది 'ఱ' కార మపుడు 'ట'కార సన్నిహితోచ్చారణము గల్గియుండెడిది. కాల క్రమమున వచ్చిన 'గ-జ-డ-ద-బా'ది సరళోచ్చారణమున నట్టి 'ట' కారోచ్చారణము 'డ'కారముగా నేర్పడెను. ఇట్లు 'వాణ్డు-సత్యాదిత్యణ్డు' మున్నగురూపము లేర్పడెననుట సత్యము (ద్రా-పరి-౧౪౪ పుట)

పర్యవసానము :-డా. కాల్డువెల్లుగారి ద్రావిడ వ్యాకరణమును, దదనుయాయిగ్రంథములును, వ్యావహారిక భాషావాసనావాసితము లనియు నకారణమునఁ బ్రాచీన ద్రావిడ భాషా స్వరూప జ్ఞానవిష యమును సరిగాఁ దెలుపఁజాలవనియు విద్యాశాఖలవారు గమనింపవల యును. ప్రాచీనద్రావిడభాషల స్వరూపమును దెల్పు తొల్కాప్పి యము కర్ణాటభాషాభూషణము-శబ్దమణిదర్పణము నన్నయాథర్వణ కారికలు మున్నగువాని సారము చదివింపవలయును. ఇంగ్లీషు పూర్ణ

ముగా వచ్చిన ద్రావిడభాషలు తెలిసిపోవు ననెడి భ్రాంతిని వీడి ద్రావిడ భాషలకుఁ బ్రత్యేకప్రాధాన్యము నీయవలయును.

5. నిజముగా సర్వజనానురంజనవిషయమున "కవితా సంగీతాది" 'కళల' వలె వ్యాకరణాదిశాస్త్రము లుపయోగింపఁబడఁజాలవు. అట్లయినను వాఙ్మయసౌధమునకు శాస్త్రములు పునాదివంటివి. సర్వజనానురంజనము సౌధ మంచే వెలయును. కాని పునాది లేనిదే సౌధము నిల్వనేరదు. సౌధములేని పునాది శోభావహము కానేరదు. కానఁ గళల యొన్నత్యస్థితికిఁ బునాదివంటి శాస్త్రముల బల మత్యావశ్యకము.

విద్వత్త్వమున కనఁగా బుద్ధివికాసమునకు 'లోఁతు' (Depth) అనఁగా గాంభీర్య మావశ్యకము. సంస్కృత వ్యాకరణాది శాస్త్రములం దట్టి గాంభీర్య మధిక మనుటకు సందియము లేదు. కాని పండితుఁ డనిపించుకొనువాని కట్టి గంభీరజ్ఞానము కొంత యావశ్యక మనుటలో విప్రతిపత్తి యుండఁబోదు.

"సంస్కారాద్ధి నియమః" అనుచొప్పున నియమ మేభాషకైనను నావశ్యకమె. నియమశూన్యమగు భాషోపయోగము కేవలము పరిహాసనీయ మగును. వ్యావహారికభాష నుపయోగించునపుడును కొన్ని నియమములు చేసికొనకున్న నట్టిభాష నిరాకరణార్హ మగును. ఈ తలంపుననె నా రచించిన వైయాకరణ పారిజాతమున (1936 క్రీ. శ.) ౨౦ విషయమం దట్టి నియమములు కొన్ని చూపఁబడినవి. గ్రాంథికాంధ్రభాషాభ్యాసములేని శాస్త్రాంతరపండితు లట్టి వ్యావహారికభాషలో గ్రంథరచనము చేసి తాము గడించిన విజ్ఞానమును దోడియాంధ్రులకుఁ బ్రసాదింపవలసినదె. కాని యవి భాషావిషయమునఁ బ్రామాణికము లనరాదు.

క. నానా శాస్త్రంబుల వి, జ్ఞానము గడియించు నాంధ్ర సచ్ఛీలుర వి

కాని యదే ప్రామాణికమనియు నట్టిదే మహాకావ్య భాషగా నుండఁదగు ననియు వచించుట యర్హముకాదు.

మ. వ్యవహారస్థమునే గ్రహించి విబుధుల్ వాఙ్నైపుణం బొప్పఁగన్
సవరింపం గద గ్రాంథికంబు వెలసెన్ దానన్యమే యద్ది లన్
వ్యవహారాన ఝుషోపమత్వరను మార్పందంగఁ బోకుండఁ గా
చు; విశాలోజ్జ్వల వాఙ్మయగ్రథిత తచ్ఛ్రద్ధంబె గ్రాహ్యంబగున్. 3

"నన్నయభట్టారకుఁడు-నథర్వణాచార్యుఁడు-తిక్కన సోమయాజి-శంభుదాసుఁడు - నాచన సోముఁడు - శ్రీనాథుఁడు - కవిపితామహుఁడు" మున్నగు నవతారపురుషులగు పండితకవీంద్రులు వెలయించిన సర్వజనాదరణపాత్రము శ్లాఘ్యము నమూల్యము నగు నాంధ్ర గ్రాంథిక వాఙ్మయమును 'శ్రీరా, మోఁకాలొడ్డిన' చందానఁ గాదని విడిచికొనుట యర్హమా ? అట్టి ప్రాచీనవాఙ్మయమునందలి భాషానియమములను సాహితీ ప్రౌఢిమమును గూలంకషముగా గ్రహించి వారిపాండిత్య వైభవమును మెచ్చికొనుట కర్తవ్యము కాదా ? అట్టి వైదుష్యమును సంపాదించుకొనుట కాంధ్రులు యత్నింపవలదా ? అట్టి మహా ప్రబంధంబులం దమ్మహాకవులు ప్రయోగించిన భాషాపద్ధతుల నేర్చి కూర్చినదే కదా వ్యాకరణము ! అభ్యాసకులకు మహాప్రబంధములలోని భాషాస్వరూపము శీఘ్రముగను దలస్పర్శముగను నిస్సందిగ్ధముగను దెలియున ట్లుపదేశించునదే కదా వ్యాకరణము !

ఆంధ్రవిద్యార్థుల కత్యంతోపయుక్తములగు "I చింతామణీవిషయ పరిశోధనము, II ఆంధ్ర వైయాకరణపారిజాతము, III ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము, IV ద్రావిడభాషా పరిశీలనము" అను గ్రంథములను రచించి వెలయఁజేసితిని. ఇంకఁ దెలుఁగునకుఁ గొఱవడి యున్న "ఆంధ్రోపయోగి సంస్కృత వ్యాకరణము" రచింపవలసి యున్నది. అట్టిదాని రచనమునకుఁ బ్రకటనమునకును నేదేని గొప్ప

సంస్థ యవలంబ మత్యావశ్యకము. తెలుఁగుతల్లి యట్టి మహాగ్రంథమును సయితము నాచే రచింపించి వెలయఁజేసి నన్ను ధన్యుని గావించుఁగాక. ఇప్పటి కట్టి సంస్కృత వ్యాకరణవిషయములను సంక్షేపముగాఁ జేర్చి బాలవ్యాకరణస్థవిషయములను సవరించి "బాలవ్యాకరణోద్ద్యోతము" అను గ్రంథమును కొలఁదికాలములో సంక్షేపముగను సకలాంధ్రవిద్యార్థి సులభముగను నుండుటకై వెలయించుచున్నాను.

6. కాలాతిపాత భీతిచే నింక సంస్కృతాంధ్ర ద్రావిడభాషల విషయములను విస్తరింపక విడిచి యొక్క ముఖ్యవిషయమును వివరించి యంతతో నీ యుపన్యాసమును ముగించుచున్నాను.

"తస్య విశ్వామిత్రస్య ఏకశతం పుత్రా ఆసుః.........త ఏతే ఉన్ధ్రాః పుణ్డ్రాః శబరాః పుళిన్దాః (శప్తాః)......ఐతరేయ బ్రాహ్మణ 2 పంచిక 3 అధ్యా. ౧౮ ఖండిక) దీనికి సరిగ "కారావర నిషాదాత్తు। చర్మకారః ప్రసూయతే। వైదేహకా దన్ధ్ర ఏతౌ। మహిర్గ్రామ ప్రతిశ్రయా" అని మనుస్మృతియుఁ జెప్పుటచే 'ఆంధ్రులు' సంకీర్ణజాతివా రని తలంతు రనుచు శాతకర్ణి ప్రభృతులగు నాంధ్రరాజులు తమ యాంధ్రత్వమును శాసనములలో వెల్లడించుకొనలే దని పెక్కురు గ్రంథకర్తలు నేఁటివారు వ్రాసిరి. (ఆం. భా. వి. ౧౮ పుట). (ద్రా. పరిశీ. ౬౮ IX విష). ఇదే యార్యులు కల్పించిన జాతిభేద కల్పనమునందలి యసంగతిని వెల్లడింపఁ జాలును. ఒకపక్షమున నార్యులుచెప్పినరీతిని జాతిభేదముల నంగీకరించినను ద్రావిడులగు నాంధ్రులు సంకీర్ణజాతివారు కారు. ఆర్యులు, మనుధర్మశాస్త్రాదులలోఁ బేర్కొన్న సంకీర్ణజాతి యంధ్రజాతి. ద్రావిడులలోనివారగు శాతకర్ణిరాజు లాంధ్రజాతివారు. ఈ రెండుజాతులను కేవలము విభిన్నములు. శబ్ద సారూప్యము చాల నుండుటచేత నివి యభిన్నములను భ్రాంతి గల్గినది. మనుధర్మశాస్త్రాదులు ద్రావిడులలోని యాంధ్రులజాతి విషయమును బ్రసంగించె ననుట

యసంగతము. మనుధర్మశాస్త్రాదులు తక్కిన తమిళ కర్ణాటాదులను పేర్కొనక యొక్క యాంధ్రులను పేర్కొనె ననుట విశ్వసనీయము కాదు.

ఉ. మానవ ధర్మశాస్త్ర మది మ్లేచ్ఛతలి నాఖ్యల జాతిభేదముల్
దాను వచించుఁగాని యిల ద్రావిడజాతుల భేద మెన్న నే
పూని వచించదే తమిళ ముఖ్యము లన్యము లన్ని గావునన్
హీన కులంబుగాఁగ మను చెప్పిన దాఖ్యల యంధ్రజాతియే. 8

ఉ. ద్రావిడులైన యాంధ్రులనఁ దాను మహాబలు లంధ్రుఁగా నప
త్నానపహాలుఁ జేయు కతనన్ భువి సార్థకనాములైరి యా
మ్లేచ్ఛవిభు లమ్మనుస్మృతిని గాంచి జనంబులు తమ్మదెట్లుగా
భావనఁ జేయువారో యని స్వాంధ్రమనఁ దెల్పిరొ శాతవాహనుల్.

అట్లుల తలంపవలయును? శాతకర్ణి ప్రభృతులు పాలించిన యాంధ్రదేశ మిత్తరిమున నర్మదవఱకు వ్యాపించి యుండెను దనుటచేత వారు తాము దక్షిణాపథ ప్రభువుల మని వ్రాసికొనిరి. "దక్షిణాపథ పతే శ్శాతకర్ణేః" (రుద్రదమన శాసనము-౧౫౦ క్రీ. శ) వ్యాకరణ సంహితా సర్వస్వము-౧౭౦ పుట).

కొందఱాంధ్రశబ్దము ప్రాచీనము కాదనియు, 'త్రిలింగ' శబ్దము ప్రాచీనము కాదనియు నాంధ్ర త్రిలింగ శబ్దము లేకవిషయకములు గావనియు నేవేవో చెప్పుచున్నారు. కాలాతిపాతభీతిచే నీ విషయమును సయితము సంక్షేపించి వచించుచున్నాను. (చూ. నా రచించిన ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వమునందలి 'విస్తర' III. ౬౧ II విష).

రెండవ శతాబ్దమునవాఁడగు (క్రీ. శ. ౧౫౦) 'టాలమీ' యను గ్రీసు పండితుఁడు త్రిలింగ శబ్దమును వాడెను. (శాత-పీఠిక-౨౫ పుట). ఈవిషయమున మెక్రిండలు దొరగారు తన 'ఏన్షియంట్ ఇండియా'

అను గ్రంథమున (౧౬౨౭ క్రీ. శ.) వివరించిరి. 'త్రిలింగ' శబ్దమును 'త్రికలింగ' శబ్దమును (త్రిక + లింగ) బర్యాయములె. త్రికలింగ శబ్దము యుద్ధమల్లుని బెజవాడ శాసనములలోఁ గలదని యాంధ్రుల చరిత్ర ౨౬-౨౭ పుటలలో నున్నది. "వేఙ్గీ భువః పతి రభూ త్త్రిక లిఙ్గ కోట్యోః" అని యున్నది. త్రిలింగక్షేత్రమే త్రిలింగదేశ మని బ్రహ్మాండపురాణములో నున్నది.

"శ్రీశైలభీమ కాలేశ। మహేన్ద్రగిరిసంయుతమ్। ప్రాకారంతు మహత్ కృత్వా।...... । ఆంధ్ర విష్ణుస్సుర యుతో। దనుజేన నిశుమ్భనా। యుధ్వా......యుతో గోదావరీ తటే। తత్కాల ప్రభృతి క్షేత్రం। త్రిలిఙ్గ మితి విశ్రుతమ్। (బ్రహ్మాండపురాణము - ఆంధ్రుల చరిత్ర-౨౮ పుట). ఈశ్లోకములనే బ్రహ్మాండపురాణమునుండి యెత్తి (కీ॥ శే॥) పిడపర్తి దక్షిణామూర్తి శాస్త్రిసిద్ధాంతిగా రాంగీరస సంవత్సర (శాలి ౧౭౯౪) (కీ॥ శ॥ 1872) పంచాంగపు పీఠికలో వ్రాసియున్నారు. వీరి నివాసము విశాఖపట్టణముజిల్లా గజపతినగరముదరి నున్న 'బూడుడుపేట' పయిశ్లోకములోని కాళేశ్వరము హైదరాబాదులోని దని వారు వ్రాసిరి. పురాణయుగమునాఁ డాంధ్రదేశ ముత్తరమునఁ జాల దూరమువఱకు వ్యాపించి యుండెడిది గానఁ బయిశ్లోకములలోని "కాళేశ్వర లింగము" కాళిదాసవర్ణిత మగు మహాకాళనాథరూప మని నా యభిప్రాయము. త్రిలింగ శబ్దమునుండియే 'తెలుంగు' శబ్దమును దాని నుండి 'తెనుంగు' శబ్దమును వైకృతము లయ్యెనని గ్రహింప నగును. 'ల' కారము 'న' కార మగుట "లాంగలము=నాఁగలి. తోల=తోన" మున్నగువానియందుఁ బ్రసిద్ధమగు వైకృతసంప్రదాయము (చూ. నా రచించిన వైయాకరణపారిజాతము ౧౨౫ పుట) (౧౨౧ విష). పయి సందర్భమును బట్టి "యాంధ్రదేశము=తెలుఁగు దేశము" అను నవి భిన్నములు కావని స్పష్టపడుచున్నది.

ఆంధ్రశబ్ద ప్రాచీనత :— "య స్సాంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాన్ధ్రభాషా సుకవిరాజ శేఖర ఇతి ప్రథిత స్సుకవిత్వ విభవేన" (నన్నయ రచించిన నందమపూఁడి శాసనము (క్రీ. శ. ౧౦౫౩). "దుర్యోధనస్య వశగాః కృతాః కర్ణ త్వయా పురా.....ఉత్కలా మేఖలాః పౌణ్డ్రాః కళిఙ్గాన్ధ్రాశ్చ సంయుగే" (భార-ద్రోణ-౪అధ్యా) "ధనంజయుండు హయంబు ననుగమించె. అది మరలి మఱియును దక్షిణాభిముఖంబయి చని తిరుగఁ బౌండ్రాంధ్ర దమిళ కేరళ కర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించుకొని" (ఆంధ్ర భారత-అశ్వ-౪ ఆ ౧౧౩ వచనము.)

పయి సందర్భమును బట్టి యాంధ్రజాతివలననే "ఆంధ్రదేశము-ఆంధ్రభాష" అనునవి వాడుక కెక్కె ననియు నాంధ్రు లేలినది త్రిలింగ దేశమని వాడఁబడెడి దనియుఁ బూర్వకాలమం దాంధ్రదేశ ముత్తరమునఁ జాలదూరము వ్యాపించియుండెడి దనియు నాంధ్ర త్రిలింగశబ్దము లత్యంత ప్రాచీనము లనియు విశదమగుచున్నది.

# నా స్వామి

కీ. శే. గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు.

స్మేరాంభోరుహపరిష్కృతాననకళాశ్రీరేఖ లోకత్రయీ
దారిద్ర్యాపహమై రహింప విలసత్కోటీరకర్పూరకా
శ్మీరాగుర్వభిలిప్తమైనగళభూషల్ నవ్యదామోల్లస
త్సౌరభ్యమ్ములు ఘుమ్మన న్నిలుచు నాస్వామిన్ నినుం గొల్చెదన్.

శరదిందుప్రతిమానసుందరముఖచ్ఛాయాతతుల్ జానకీ
స్ఫురితాక్షిద్వయకైరవమ్ములకు మేల్ ముస్తాబులం గూర్పఁగా
దరహాసాంకురముల్ నితాంతభవబాధాతప్తభక్తాళిపై
గరుణాపూరముఁ జల్లఁగా నిలుచురక్షాదక్షు నిన్ గొల్చెదన్.

కాలాంభోదరతుల్యదేహవిలసత్కార్తస్వరాలంక్రియా
జాలంబుల్ చపలాత్వముక్తతతభానాపూర్ణసౌదామనీ
శ్రీలం జాటఁగ భక్తరక్షణకళాశృంగారసర్వస్వ మై
లీల న్నిల్చినవిశ్వభద్రము సురపాళి న్ని న్నుపాసించెదన్.

వేదాంతార్థనిరూపితాద్భుతయశోవిస్తార ముద్యన్మహో
కోదండాగ్రవిధూతరాక్షసచమూఘోరాట్టహాసంబు కో
ట్యాదిత్యప్రతిమానతేజము మునీంద్రాత్మైకగమ్యంబు లో
కాదర్శంబు చిరంతనం బగుత్వదీయాకారముం గొల్చెదన్.

నమ్మినదూత యా పవననందనుఁ డంఘ్రియుగంబుఁ గొల్వ సీ
తమ్మయు లక్ష్మణుండు నుభయాంకములం జెలువొంద మందహా
సమ్ము రహింపఁ గార్ముకనిషంగములన్ భుజసీమ లొప్ప ర
మ్యమ్ముగ నిల్చువీరకరుణామృతమూర్తిని సంస్మరించెదన్.

హాసమనోజ్ఞమైనవదనాబ్జము శాశ్వతవిశ్వమంగళా
వాసము గాగ వాయుజునిపైఁ బ్రసరించినసవ్యహస్తవి
న్యాసముతో భుజస్థధనురగ్రము పాకినయన్యహస్తవి
న్యాసముతో నెసంగువరదాభయమూర్తిని సంస్మరించెదన్.

రా! రావయ్య! పరాత్పరా! భువనవీరా! రాజరాజేశ్వరా!
రారాజన్మ్యజవిక్రమాహతమహారాత్రించరా! రాగదా
రా! రాజీవదళాక్ష! వారిధిగభీరా! సన్మనుష్యావతా
రా! రామయ్య! నిరస్తతామసవికారా! రాఘవాగ్రేసరా.

ఏమయ్యా! ప్రభు! ఇంతనిష్కరుణ! నిన్నే నమ్మి నీపాదసే
వామాధుర్యముఁ జూఱఁజుఱ్ఱుకొను నాపై పంతమా నీకు నా
స్వామీ! భక్తజనావనప్రథితదీక్షల్ నేఁడు నాపట్ల నీ
వేమైనన్ దృజియింపలేవు గద తండ్రీ! సర్వలోకేశ్వరా!

ఆదరపూరితంబు దరహాససఖం బగునీకటాక్ష మిా
నాదెసఁ బర్వనట్టిసుదినం బెపుడేనియు వచ్చునా ప్రభూ!
నామరదృష్టముల్ తొలఁగునా యిక నెన్నటికేని నిత్యని
ర్వేదము లెంతగా ననుభవింతును చెప్పుము దీనబాంధవా!

ఏనా డీహృదయవ్యథల్ తొలఁగు నిం కేనాఁడు దివ్యద్యుమా
స్థానంబై శతకోటిమన్మథసదృక్షంబై జగన్మోహన
శ్రీనవ్యంబయి ప్రావృషేణ్యఘనరోచిశ్శ్లిష్టమై యొప్పునీ
జ్ఞానానందమయస్వరూపమునుఁ గాంచ న్నేర్తునయ్యా! ప్రభూ!

కామక్రోధముఖారిషట్క మది లొంగన్ లేదు ధీతామసం
బేమాత్రంబు నశింపలేదు కలవయ్యేన్ నిశ్చలత్వంబు నా
స్వామిా! కోర్కెలు చావలే దెడఁద నీపాదాబ్జమున్ దుస్తర
వ్యామోహంబునుఁ బాపవా! కరుణరాదా యీవ్యథాజీవిపై!

[252 వ పేజీ తరువాయి.]

అక్కడ దళపర్యాయమైన 'పత్ర' పదమును వాడినట్లే యిక్కడ 'చల' పర్యాయమైన 'తరళ' పదమును వాడియుండును. ఈతనికవితలో నిట్టివి విచిత్రములుగావు. కావున "తరళదళతిరుమహా ర్తిక" అనునది మంచి పాఠమని తలంతును. పరిశీలనము కావించినచోఁ దత్త్వము తెలియును.

ఒక రాజపుత్త్రి తన చెలికత్తెలతోఁ బౌండరీకక్షేత్రమునఁ బ్రవేశింపఁగా వారి యునికిజనులమీఁదికస్తూరిపరిమళము నలుదెసల వ్యాపించి యటనున్న తాపసులతాల్ములను దూలించుచున్నదని చెప్పుట—

మత్తకోకిల :

జాలిదక్క మతాంతరాళవిశాలవేదులయందుఁ గో
ణాలగొందిఁ దపంబు సల్పు జనంబు తాల్ములు దూలుఁ ద
ద్బాలికాకుచనిస్తులస్తనపాళికామృగనాభివా
తూలికాహతిఁ బక్వశాల్మలితూలికాశకలాకృతిన్. (౯-296)

టీకలో "కోణాలగొందిన్ = కృష్ణునిగూర్చి" యని యర్థము వ్రాసిరి. ఈ యర్థమునకుఁ బ్రమాణము కానరాదు. పూర్వగ్రంథములోని "కోనాలగొంది" యను పాఠము మాని యీ పాఠమును సూర్యరాయాంధ్రనిఘంటువులో నుండుటచే వీరు గ్రహించినటు లర్థసూచి కనుబట్టెడు తెలియుచున్నది. చిత్ర మేమనఁగా నా నిఘంటువులో నీపదమునకు "మిక్కిలి యిఱుకైన చీకటిమూల" యని యర్థ మీయఁబడియున్నది. కాని కృష్ణుఁడు అను నర్థము లేదు. తా మీపాఠమునే గ్రంథమునుండి గ్రహించిరో యందు దీనికీయఁబడిన యర్థము చూడకుండుట వింత. చూచియు నాయర్థము గ్రహించనిచోఁ దాము వ్రాసిన యర్థమునకుఁ బ్రమాణము చూపుట భావ్యము. ఆనిఘంటువులో నీపదమున కీప్రయోగమే చూపఁబడుటయు నొకవిశేషము. పరిమళము సందుగొందులలోఁగూడ వ్యాపించి మూలలఁబడియున్న తాపసుల డెందములను గలఁచుచున్నదనుటయందే కవి తాత్పర్యముగాన సూ. ని. లోని యర్థమే ప్రకృతానుగుణమును గ్రాహ్యమునైయున్నది.

ఆ. అవసరంబుగాచి యుల్లంతదప్పుల నుంచి సురులు దనకు దండము లిడ (5-295)

'సురులు' తప్పు. 'సురలు' అని యుండఁదగును. మూలముననే గాక టీకలోఁగూడ 'సురులు' అనియే యుండుటంజేసియుఁ, దప్పొప్పుల పట్టికలోఁ జూపఁబడమింజేసియు నియ్యది ముద్రణదోషముగా భావింప వీలులేదు. పూర్వగ్రంథమున 'సురలు' అనియున్న సాధుపాఠమును వీరేల మార్చిరో యూహింపనలవికాదు.

స్థాలీపులాకన్యాయముగాఁ గొన్ని దోషముల నీవ్యాసమునఁ జూపితిని. వ్యాసవిస్తరభీతిచేఁ గొన్నిటిని విడిచితిని. తప్పొప్పులపట్టిక లోని కెక్కని యచ్చుతప్పు లెన్నియో గలవు. వానిని బేర్కొనుట కిది తావుకాదు. కొన్ని సందేహాస్పదవిషయము లున్నవని ప్రారంభమున మనవిచేసియుంటిని. వానినిగూర్చి యింకొకమాఱు వ్రాయుదును. వానిని బండితులు పరిశీలించి తమ యభిప్రాయములఁ బ్రకటించి జిజ్ఞాసు లోకమున కుపకారము చేయుదురని యాశించుచున్నాను. కావ్యపాఠార్థ తత్త్వజిజ్ఞాసతో నీవ్యాసమును వ్రాసితిని. కాని వ్యాఖ్యాతలఁ గొంచె పఱుచుటకుఁ గాదు. భ్రమప్రమాదములు మానవబుద్ధికి సహజ ములు. శ్రీరంగాచార్యులవారి టీకలోఁ గొన్నిలోపము లున్నంతమా త్రమున వారొనర్చిన కృషి ప్రశంసనీయము కాకపోదు. అట్లే శ్రీవేం కటరమణయ్యగారి టీకలోఁ గొన్నిదోషములున్నను వారు కావించిన పరిశ్రమము శ్లాఘ్యముకాకపోదు. పూర్వటీకలోని దోషములఁ దొలఁ గింపఁబూని నవ్యటీకాకారులు కొన్ని పొరపాటు లొనర్చినట్లే నవ్యటీక లోని దోషములఁ జూపఁబోయి వ్రాసిన నావ్రాఁతలోఁగూడ దోష ములు దొరలవచ్చును. ప్రాజ్ఞులు వానినిగూడ విమర్శించి తత్త్వనిర్ణ యము చేయుట మంచిది. పాండురంగమాహాత్మ్యపాఠతదర్థపరిశీలన మింకను జేయవలసిన యావశ్యకత కలదని తెలుపుటకై వ్రాసిన నా యీ పౌరోభాగ్యమును సహృదయులు మన్నింతురుగాక.

# శివలీలావిలాసము

## తృతీయాశ్వాసము

సీ. ఒకని వ్రేయఁగఁ బోటి యొఱపు దప్పినఁ బ్రక్క
కుఱికి వేఱొక్కని నఱుకువాఁడు
ఒకనిమీఁదికి వీఁక నొకఁ డుఱుఁగఁ జూచి
యడలున నతని గబ్బణఁచువాఁడు
ఒకని దానణఁచి తన్నొకఁ డడవకయుండఁ
గడఁకతో దమమొనఁ గలియువాఁడు
ఒకడు వైచినయస్త్ర మొకనిఁ దాకకయుండ
వెరవున నడుమన విఱుచువాఁడు

తే. గీ. నగుచు నీఁడు వాఁ డనక యిట్లఖిలభటులు
నలఘువిక్రమక్రమలీల లతిశయింప
మొనసి పెక్కుతెఱంగులఁ బెనఁగి పురక
వీర మాకారములు గొన్నవిధము దోఁప.

తే. గీ. తరిమి యలగోలునకు నంత దండగోలు
గాఁగ రెండుదళంబులు కదియ నడచె
సంగరారంభ మాననసరసిజముల
కొనరి క్రొత్తవాసనక్రియ నుల్లసిల్లె.

వ. ఇట్లు నడచి తేరులుఁ దేరులు, నేనుఁగు లేనుంగులు, వారువంబులు వారువంబులుఁ, గాలుబంట్లునుం గాలుబంటులుం, దలపడి యమ్మోహారంబులనడిమికట్ట యవిసిన యభిముఖప్రవాహంబులుం బోలె, నొక్కటొకటిం బోరంబాఱుచుఁ, దూర్పుపడమటివాయువుల నెగయు తరంగములుం బోలె, నొకటొకటిం దూలనూఁకుచు, సరిగాఁ బోరు సమయంబున—

ఉ. దానవసేన యంతయును దర్పమెలర్పఁగ నెల్లవంకలన్
దాఁ నగుచున్ ఖరాంబకగదాత్రిశిఖాసికుఠారపూర్వనా
నానిశితాస్త్రసాంద్రపతనంబులఁ దాలిమి దవ్వుచేసినం
బూనికమాలి దేవబలముల్ పఱచెన్ భయసంకులంబుగాన్.

క. తమముందటిబల మఱిగిన
నమరపతిశిఖిశమనసిర్మృతియాదఃపతివా
యుమనుష్యవాహసర్ష భ
గమనులు దలపడిరి దనుజగణముల నంతన్.

ఉ. తచ్ఛరజాలాస్త్రశస్త్రములతాఁకున దేఁకువ దక్కి లోకముల్
నచ్చల మెల్లఁ బొల్లువడ నాసురలాసురరాజియోజకుం
జొచ్చి తముం గనుంగొనకఁ సొంపునఁ బెంపరపెట్టి, దట్టముల్
విచ్చిరి సాధ్యసధ్వములు విశ్వకటాహమునిండఁ బర్వఁగన్.

క. తమబలము దీనతాసం
సంభ్రమమున విఱుగుటయుఁ జూచి రాక్షసనాథుల్
తమకించి వజ్రిముఖులగు
నమరుల వడిఁ దాఁకి రోలి సాహసదీక్షన్.

మత్తకోకిల :—

చండజృంభపరాక్రమక్రమసంభ్రమంబుల నుబ్బి వే
దండముల్ దమలోన నొక్కటఁ దాఁకినట్టినిరూఢి నా
ఖండలాద్యపులోమముఖ్యసగర్వదేవనిశాటనుల్
భండనం బొనరించి రుబ్బి యభంగదుర్దమలీలలన్.

సీ. గండభేరుండవర్గములఘాతకుఁ గాక
పగిలి పాఱెడుశరభంబు లనఁగ
శరభయూథముల నిష్ఠురత నిల్వఁగ లేక
వెఱచి పాఱెడిమృగవిభు లనంగ

మృగవిభుకులముల తెగువ కోరువ లేక
ప్రబమసి పాఱెడిసింధురము లనంగ
సింధురఘనబలజృంభఁ మోర్వఁగ లేక
బెలసి పాఱెడిగోలుపులు లనంగ
తే. గీ. కోలుపులితండముల దిట్టకోలుతలకుఁ
దలఁకి పాఱెడుహరిణపోతము లనంగఁ
దన్మహాసురేంద్రులసముద్ధతికి వెఱచి
పఱచి రొక్కట నిర్జరప్రవరు లెల్ల.

వ. ఇట్లు సమబలంబులుగాఁ (బోరి పోరి సమరతలంబు విడిచి) సమా కులు లగుచు నాకులు ధృతి మఱచి కన్నవారు కన్నదిక్కులకుఁ బఱచి యార్తజనశరణంబు లగురమాభర్తచరణంబు లాశ్రయింత మని తలంచి నిర్ణయించి కదలి యాక్షణంబ మోక్షసంపదలకోవి యగు తెల్లదీవి కరిగి తత్ప్రదేశంబునందు వినూత్నరత్నప్రకాశంబులఁ గ్రంమకొనుదివ్యాగారంబు దర్శించి యుచిత ...... ..

సీ. పాపపానుపుమీఁదఁ బవళించుజాణను
విరులపోటరిఁ గన్నబిరుసులానిఁ
జక్కలపడవాలుచొక్కపువియ్యంబు
బసిఁడిచీరలు గట్టుపగటులానిఁ
గడలిరాచూలిఁజొక్కపుఁ (బెండ్లికొమరుని)
బులుఁగురాయని నెక్కుబూమెలాని
నేమంగుఁ బ్రోమట కెలరాకుచుట్టంబుఁ
దమ్మిపొక్కిటఁ గల్గునెమ్మెలాని
తే. గీ. గనిరి వార లుచితగతి నీరజాతసం
భూతభారతీశముఖచతుష్క-
జనితనిఖిల (నిగమశాఖశిఖాగణ)
వ్యక్తసత్ప్రభావు వాసుదేవు.

క. కని సాష్టాంగప్రణతులు
ఘనభక్తి రచించి ఫాలకవితాంజలులం
గనుపట్టుచు నార్తులు నూ
తనమూర్తులు గన్నకరణిఁ దగి యున్నతఱిన్.

క. (జలజాతాక్షునుఁ సకరుణ
విలసితవీక్షణము లమరవితతులమీఁదన్
బొలయంగ ననంతరమ వా
రలఁ జూచి కతం బదేమి రాకకు ననియెన్.

వ. అనిన విని నిర్జరులు దేవా ! పులోమప్రముఖుల........యతాచ
లంబునఁ దదుద్భవపదార్థవిసరంబులు తమకుఁ బొలువచ్చు ననుచుఁ
జలంబెత్తి యెత్తివచ్చి సురాగ్రహంబులుం బరాక్రమంబులు మెఱయ
మా సంపద లెల్ల కొల్లలాడి......చెదరగుచు విచ్చి వచ్చితి మా
రాక్షసు లితరాయుధంబుల వధంబు నొందరు ; శివుండు జలంధరా
హరణార్థంబు నిర్మించినచక్రంబు తత్ప్రసాదంబునఁ బడసి మాయ ..
.ప్రణమిల్లిన నతండును-

ఉ. ఇప్పుడ యేఁగువాఁడఁ బరమేశ్వరు నీశ్వరునిం బ్రసన్నుగా
నొప్పఁగఁ జేయువాఁడ నరు దొందఁగ నాయనఁ చేతఁ జక్రముం
(దప్పక పొందువాఁడ నలదానవనా) యకసేనలం గడుం
దుప్పలఁదూల్చువాఁడ, నిజమన్నహదోర్బల ముల్లసిల్లఁగన్.

క. మీ రరుగుఁ డంచు నంతన
నీరరుహోదరుఁడు భువననిర్వాహకథా
ధారుఁడు సంతతసదయవి
చారుఁడు (శివు గుఱిచి తపము స)లుపఁగఁ జనియెన్.

చ. చని హిమవంతమున్ గనియె నారసలోచనుఁ డంత ముందటన్
కనకగుహాగృహాంతరనికామవినోదనిషక్తకిన్నరీ

జనపరిగీత రాగరససంశ్రవణప్రకటాతుమానను
ర్ద్రవశిథిలీ............

క. అన్నగరాజు-మీఁదికి
నన్నిలినోదరుఁడు చనియె నమరసరిత్స్రం
పన్నలహరీభవం బగు
సన్నపుఁ బవమాన మెనురు చను దేరంగన్.

వ. అట్లు చని నిజగాత్రంబు గంగాస్నాన (పవిత్రంబు సేసి యుచిత)
నియమానుకూలం బగుదదీయకూలంబున విడిసి, యేకక్ష-యుచిత
స్థలంబున నీలప్రభాంగం బగుహరినీలమణిశివలింగంబు నిలిపి యనంత
రంబ-

మ. త్వరితాఖ్యంబు........వాహంబు మున్గాఁగ ని
ద్భరశాస్త్రాంతరదృష్టభాస్వనుపచారవ్రాత మెల్ల న్సమా
దరయుక్తిం గ్రమవృత్తితో నడపుచుం దత్త్రత్ప్రకారంబుబం
హరి దాఁ గొల్వఁగఁ జొచ్చె శంభుని బ్రపంచాతీతసంరంభునిన్.

క. సాంగప్రదక్షిణంబులు
సంగతిమైఁ జలుపు ఫాలసక్తాంజలి నై
మంగళజయ ఫణితులు శివ
లింగమునకు నొసఁగు నతఁడు లీయవుభక్తిన్.

సీ. ఫణిశాయిచండి! యఁభవుఁడు

... ... ...

సరణిసారజ్ఞండు సర్వతత్త్వావలం
బనుఁడు ననంతమై పరగుచున్న
నామసహస్రంబునను శంభుఁగొల్చుచుఁ
బూని యేకైక-కయభిధానమునకు
నేకైక కమలంబు నొప్పుగా నర్పించు

తే. గీ. జలువు చుండు నిట్లు సద్భక్తితోడ మ
హోపహారకలన మొనరఁజేయు
గరము భక్తి దనుజఖండనునకును, సో
మలసుధామయూఖమండనునకు

క. (మందర) ధరుఁ డీగతి న
స్పందనియతితోడఁ దన్ను భజియింపంగా
నిందుధరుఁ డతనిభావం
బందుఁ గలుగు నిష్ఠ కలిమి యారయఁ దలఁచెన్.

వ. అంత నొక్కనాఁడు ప్రభాతసమయంబున నంబుజోదరుండు యథా
పూర్వంబుగా, గంగాస్నానంబుఁ జేసి, తదీయాంతరస్థ (లజాతంబు
లగు) వికచసరోజాతంబులు గోసి సహస్రంబుగాఁ బ్రయత్నంబున
లెక్కవెట్టి చిగుళ్ల నొప్పం గట్టి యదియునుం గమండలుభరితంబు
లగు శుద్ధజలంబులుం గొనుచు శివాలయంబున కరిగి యుచితోప
చారంబుల నమ్మహాలింగంబు నారాధించుసమయంబున

క. సరి నిజపూజార్థముగా
హరి దెచ్చిన వారిరుహసహస్రముతోనన్
బరమేశ్వరుఁ డొకకమలము
కర మరుదుగ మాయచేతఁ గ్రక్కునఁ దాఁచెన్.

క. అట నమ్ముకుందుఁడును నె
ప్పటియట్ల సహస్రనామ పఠనముతోడన్
నిటలవిలోచనుఁ బల్లవ
పుటికాంతరజలరుహములఁ బూజించుతఱిన్

వ. ఒక్కనామంబున నొక్కకమలంబు కడమవడిన (వేదిక) వెదకి
కానక విష్ణుం డాత్మగతంబున.

# వ్యక్తి వివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

సమాధానము. దాసీపుత్రః- అను ప్రయోగమున నిన్దగమ్యమాన మగు నని యెవ రనుచున్నారు—ఇచట పుత్రునియొక్క స్వరూపము మాత్రమే గమ్య మగును. నిన్ద గమ్యము గాదు. ఈ శబ్దము నుండిగూడ నిన్దయే గమ్య మగుచో నీ సూత్రము నారంభించుటలో గల ప్రయోజనమును విచారింపవలసి యుండును—

సమాసమునందు విభక్తి యుండదు—విభక్తి లేనపుడు విశేషణగత మైన విధేయత భాసింపదు. అది భాసింపనపుడు, విశేషణప్రయుక్త మైన యుత్కర్షాపకర్షలు విశేష్యమునందు భాసింపవు. అవు డుత్కర్షాపకర్షమూలక మగు రసప్రతీతి కలుగదు. కావున నిట్టితావులందు విధేయావిమర్శ దోషము సంభవించుచున్న దని చెప్పవలసి వచ్చినది.

అవ్యయీభావ సమాసమున కుదాహరణము

"సా దయితస్య సమీపే అవస్థాతుమ్ నాపి చలితు ముత్సహతే
హ్రీసాధ్వసరసవివశా స్పృశతి దశాంమ్ కామపి నవోఢా.

అర్థము. సా = ఆ నాయిక, దయితస్య = ప్రియుని యొక్క సమీపే = సమీపమునందు, అవస్థాతుం = నిలుచుటకుఁగాని, చలితుమపి=కదలుటకుఁ గాని, నోత్సహతే = ధైర్యముచేయుట లేదు. హ్రీసాధ్వసరసవివశా=సిగ్గు భయములకు లోనైన, నవోఢా = నూత్నవధువు, కామపి, దశామ్ = వర్ణించుటకు వీలులేని స్థితిని; స్పృశతి = అనుభవించును.

ఇందు "దయితస్య" అనునది "సమీపే" అనుదానికి విశేషణము—ఈ విశేషణమువలన, నాతని సామీప్యము సుకృతశతలభ్యమను నర్థముగోచరించును. ఇందుచే సమీపమునందలి యుత్కర్షాతి

శయము భాసించును. ఆ యుత్కర్షాతిశయము రతి యను స్థాయిభావ మున కుద్దీపకముగఁ బర్యవసానము నొందును. ఇట్లు "దయితస్య" అను విశేషణ మిచట ప్రధానముగ వివక్షితమగుట వలననే, అది విడిగనే ప్రయోగింపఁబడినది. సమీపార్థమును బోధించు "ఉప" యను నవ్యయముతో దీనిని గలిపి "ఉపదయితమ్ అను నవ్యయీభావసమాసముఁ జేయుచో, "దయిత" పదమునకుఁ గల ప్రాధాన్యము పోయెడిదే.

ఇందుకుఁ బ్రత్యుదాహరణము:—

"మధ్యే వ్యోమ త్రిశంకోః శతమఖవిముఖః
స్వర్గసర్గం చకార

అర్థము. శతమఖవిముఖః = ఇంద్రునియెడ విరోధము గల విశ్వామిత్రుఁడు, మధ్యేవ్యోమ=ఆకాశముయొక్కమధ్యమున, త్రిశంకోః= త్రిశంకునకు సంబంధించిన, స్వర్గ సర్గం = స్వర్గలోకసృష్టిని, చకార = చేసెను.

ఇచ్చట విశ్వామిత్రునియొక్క తపఃప్రభావాతిశయము ప్రతిపాద్యము—ఏమియు సాధనములు లేకయే శూన్య మగు నాకాశమునందు, స్వర్గమును సృష్టించినాఁ డనుటవలననే, యాతని తపః ప్రభావము మనకుఁ దెలియును. కావున నిచట నాకాశవాచక మగు "వ్యోమ" శబ్దమే ప్రధానముగ వివక్షితము గాదు. ఆకాశమధ్యము ప్రధానముగ వివక్షితము. కాని యిచట మధ్యేవ్యోమ—యని సమాసముఁ జేయుటతో "వ్యోమ" శబ్ద ప్రాధాన్య మంతరించినది—సమాసముఁ జేయఁగూడనిచోటఁ గవి సమాసముఁ జేసినాఁడు. "మధ్యే వ్యోమ్నః" అని వ్యోమ శబ్దమును వ్యస్తముగనుంచినచో బాగుండెడిది.

ఇంతవఱకుఁ, దత్పురుషాది సమాసముల నెచ్చట చేయరాదో రూపించినారము — కృత్తద్ధితవృత్తుల విషయమునఁగూడ నింతకు ముందు, నిరూపించినరీతినే మన మనుసరింపవలయును.

కృత్తద్ధితవృత్తుల కుదాహరణము.

"యః సర్వం కషతి ఖలో బిభర్తి యః కుక్షిమేవ సత్యతిథౌ
యశ్చ విధుం తుదతి సదా శీర్షచ్ఛేదం త్రయోపి తేఽర్హన్తి"

అర్థము. యః = ఏ ఖలః = దుర్మార్గుడు, సర్వం = సమస్తమును, కషతి = హింసించునో, యః=ఎవఁడు, సత్యతిథౌ = ఏకాదశి నాఁడు, కుక్షిమేవ = పొట్టనే, బిభర్తి = నింపునో, యశ్చ = ఎవఁడైతే, విధుమ్ = చంద్రుని, తుదతి = పీడించునో, తే, త్రయ అపి = ఆ ముగ్గురును, సదా = ఎల్లపుడును, శీర్షచ్ఛేదమ్ = తల నరకుటను, అర్హన్తి =తగుదురు.

యః సర్వం కషతి:—ఇచట సర్వశబ్దమునకు సమస్తము నని యర్థము భువనాభయదానదీక్షాబద్ధకక్షులగు బోధిసత్త్వుల చరితము గూడ సర్వములో నంతర్భావము నొందును. ఖలులగువారు, దమ్భాది దోషముల నారోపించుటచే, బోధిసత్త్వుల పవిత్ర చరిత్రమునుగూడ మలినముఁ జేయుదు రని భావము. ఇట్లు సర్వమును హింసింతు రనుటతో ఖలులయందలి యపరాధ మతిశయించుచున్నది. కషణ క్రియకుఁ గర్మభావమున విశేషణ మగు సర్వశబ్ద మీ యపరాధాతి శయరూప మగు నపకర్షను వ్యంగ్యము సేయుచున్నందువలన నిచట ప్రాధాన్యమును వహించును. సర్వం కషతి—అను రెండుపదములును విడిగా నుండుటచే సర్వపదవ్యంగ్య మగు నర్థము చెడిపోలేదు—సర్వ కూలాభ్రకరీషేషు కషః అను పాణినీయ సూత్రము ననుసరించి 'సర్వఙ్కషః' అను కృద్వృత్తిని జేసినచో సర్వశబ్దమునకుఁ గల ప్రాధాన్యము నశించెడిది.

బిభర్తి కుక్షిమేవ: కుక్షి = యను శబ్దము శరీరమున కుపలక్షణము. శరీరము సర్వాశుచి నిధానము—వినశ్వరమును—ఏకాదశినాఁడు గూడ నట్టిశరీరమును పోషించుకొనుటయందే యాసక్తి యుండుట

యనునది తిండిపోతుయొక్క యపరాధాతిశయమును వ్యంగ్యము సేయును. ఈవ్యంగ్యమునకు హేతు వగుటచే కుక్షిశబ్ద మిచట ప్రధాన ముగ వివక్షితము. ఈప్రాధాన్యము భాసించుటకయియే, కుక్షిశబ్దము వ్యస్తముగనె ప్రయుక్త మయినది. ఫలేగ్రహిరాత్మంభరిశ్చ "చాత్కుక్షింభరిశ్చ"—అను పాణినీయ వ్యాకరణము ననుసరించి"కుక్షింభరిః" అని కృద్వృత్తిని జేయుచో కుక్షిశబ్దమునకుఁగల ప్రాధాన్యము భాసింపదు.

విధుంతుదతి: చన్ద్రుఁడు సకలజగదానన్ద దాయకుఁడు—అటు వంటి చన్ద్రునిగూడ పీడించురాహువుయొక్క దండార్హతను జందశబ్దము ప్రతిపాదించును. ఇచ్చటఁగూడ "విధ్వరుషోస్తుద" యని పాణినీయ సూత్రము ననుసరించి విధుస్తుదః — అని కృద్వృత్తి నాశ్రయించుచో విధుశబ్ద ప్రాముఖ్యము గోచరముకాదు.

శరీరమునకు సంబంధించిన దండములలోఁ దలను నఱుకుటయే తీవ్రతమగు దండము. అందుచే "శీర్షము" నకుఁ బ్రాముఖ్యము గోచరింపవలయును. "శీర్షచ్ఛేదాద్యచ్చ" యను తద్ధిత సూత్రము నాధారముగఁగొని "శీర్షచ్ఛేద్యమ్" అనియొకే పదముగఁ బ్రయోగించి యున్నచో శీర్షశబ్దము తనకుఁగల ప్రాముఖ్యమును గోల్పోయెడిదే.

ఇట్లు కృద్వృత్తి, తద్ధితవృత్తి—అనువానిఁగూడ నెల్లతావు లందునఁ జేయరాదని తెలియవలెను.

మఱికొన్ని యుదాహరణములు: (1) "రామోఽస్మి సర్వం సహే" "నేను రాముఁడను, సర్వమును సహింతును;"—ఇట "సర్వమును" అను నర్థమును బోధించు పదమును వ్యస్తముగ నుపయోగించుటలో నౌచిత్య మున్నది. అట్లుగాక "పూస్సర్వయోర్దారిసహోః" అనుపాణినీయసూత్రము నాశ్రయించి—సర్వమ్, అనుపదమును, సహ

ధాతువును గలిపి "సర్వంసహాః" అనియొకే పదముఁజేయుచో, సర్వ శబ్దమునకుఁగల ప్రాధాన్యము నమసిపోవును.

(2) "ఉచితకారిత్వం ప్రతి కిముచ్యతే రామభద్రస్య దశరథస్య హి ప్రసూతి రసౌ"

"రామభద్రునియొక్క యుచితకారిత్వమును గుఱించి యేమి చెప్పవలయును?" "ఇతఁడు దశరథునియొక్క పుత్రుఁడుగదా!" ఇచట దశరథుని సంబంధమువలన రామునియం దుత్కర్షాతిశయము భాసింప వలయును నభిప్రాయముతో దశరథ శబ్దము వ్యస్తముగఁ బ్రయుక్త మైనది—ఇట్లుగాక, "తస్యాపత్యమ్" "అతఇఞ్" అను పాణినీయ సూత్రముల నాధారముగఁగొని, "దశరథస్య ప్రసూతిః" అనుటకుఁ బదులుగ, "దాశరథిః" అను నొకేపదము ప్రయోగించుచో, దశరథ శబ్దప్రాముఖ్యము భాసింపను.

"సర్వంకషః" "సర్వంసహాః" అనుపదములు, కర్త్రర్థమునందు "ఖచ్" అను ప్రత్యయమును విధించుటచే రూపొందినవి. అందుచే నిచట, కషణక్రియకును, సహనక్రియకునుఁగల కర్తయే ప్రధానముగ భాసించును. సర్వశబ్దగతమగు కర్మత్వము ప్రధానముగ భాసింపనే భాసింపదు. అప్రధానముగమాత్రమే భాసించును.

ఆక్షేపము: కృత్తద్ధిత సమాసవృత్తులఁ జేయుచో, కర్మాది కారకములకుఁగల ప్రాధాన్యము పోవు ననిగదా తాము చెప్పినది!— కాని యది సమంజసముగ లేదు — వాక్యమునందుఁ గ్రియకే ప్రధాన భావ ముండునుగాని, కారకాదులకు లేదు. "క్రియాప్రధానం గుణవదే కార్థం వాక్యమిష్యతే"—అను వాక్య మీ యర్థమునే తెల్పును. కర్మాదికారకములకుఁ బ్రధాన భావమే లేనపుడు, సమాసాదులయందు వాని ప్రాధాన్యము పోవుననుట యెట్లు పొసఁగును!

సమాధానము: వాక్యమునందుఁ గ్రియయే ప్రధానమని మీరు చెప్పిన మాట సత్యమే—అయినను, క్రియాప్రాధాన్యముకంటె భిన్నముగ, కారకములకుఁగూడ, వివక్షాకృత మైన ప్రాధాన్యము భాసించుచునే యుండును.

ఆక్షేపము:—క్రియ సాధ్యము; కారకములు సాధనములు. సాధ్యమగు క్రియకే ప్రధానభావ ముండునని మేము సప్రమాణముగ నిరూపించితిమి. సాధనములకుఁగూడ వివక్షాకృతప్రాధాన్యముండు నని మీ రనుచున్నారు—సాధ్యసాధనములకు రెంటికిని నొకేసమయమున ప్రధానభావ ముండుననుట యుక్తి యుక్తమగునా?

సమాధానము: ప్రాధాన్యమనునది మూఁడువిధములుగ నుండును

(1) శబ్దకృత ప్రాధాన్యము :—కర్మధారయ సమాసమున విశేష్యమగు నుత్తరపదమునకుఁగల ప్రాధాన్య మీ తెగకుఁ జెందును.

(2) అర్థకృతప్రాధాన్యము "గృహం సమ్మార్ష్టి" "పాత్రను సమ్మార్జనము సేయుచున్నాఁడు—"ఇచ్చటగృహములు పాత్రివిశేష మును సంస్కరింపవలయును. సంస్కార్యమగుటచే గృహమున కిచట వాస్తవమైన ప్రాధాన్య మున్నది.

(3) వివక్షాకృత ప్రాధాన్యము:—"రామస్య పాణిః అసి" "దశరథస్యపుత్రః" అను తావులందు రామ దశరథ శబ్దములకు వివక్షాకృతమైన ప్రాధాన్యము.

ఈ మూఁటిలోను, వివక్షాకృత ప్రాధాన్యమే బలీయము. శబ్దార్థకృత ప్రాధాన్యముల కింతటి బలములేకుండుటచే, నవి వివక్షాకృతప్రాధాన్యముతో సమానములుకావు. సమబలములుకాని ప్రాధాన్యములొకే సమయమున నొకేవాక్యమునందు భాసించినను దోషము లేదు. ఇందుకుఁ దేలిన తాత్పర్య మిది:—ఎటులైనను సరియే, ప్రధానముగ వివక్షితమగు పదమును దేనినిగూడ, నితరపదముతోఁ గలిపి

సమాసముఁ జేయఁగూడదు. ఈ నియమము నవశ్యముగ పాటింప వలయును. ఆ యితరపదములు, విశేష్యములుఁగాక, యుపమ్యమగుఁగాక, ఏమైనను సమాసము కూడ దనియే నియమము. ద్వంద్వసమాసమున నందును, ఏకశేషవృత్తి యందును నుండు రెండు పదముల యర్థముల కును, శేష్యశేషణ భావసంబంధముండదు. అయినను, ఆపదములకుఁ బ్రత్యేకముగఁ గ్రియతో నన్వయించుట వలనఁ గలుగు ప్రాధాన్యమును కవి ప్రతిపాదింప నెంచుచో నాపదములకుఁగూడ సమాసమునుగాని ఏకశేషమునుగాని చేయఁగూడదు.

ఉదాహరణము:—

"కిమంజనేనాయతలోచనాయాః, హారేణ కిం పీనపయోధరాయాః
పర్యాప్త మేతన్ననుమండనం, తే,రూపంచ, కాన్తిశ్చ విదగ్ధతాచ"

అర్థము; ఆయతలోచనాయాః = విశాలమగు లోచనములు గల యామెకు, అంజనేన = కాటుకతో, కిమ్ = ఏమిప్రయోజనము; పీనపయోధరాయాః = పీనపయోధరయగు సుదతికు, హారేణ కిమ్ = మెడలోని హారముతోనేమి ప్రయోజనము? తే =నీకు, ఏతత్ = ఈ, రూపమ్‌చ = రూపమును, కాన్తిశ్చ = కాన్తియు, విదగ్ధతాచ =నేర్పరి తనమును, పర్యాప్తమ్ = సమగ్రమైన, భూషణం = అలంకారము, (భవతి) నను = అగునుగదా !

ఇచట రూపము - అలంకరణమే యగును, కాన్తియు నలంకర మే యగును— విదగ్ధతయు నలంకరణమేయగును. అని మనమన్వయముఁ జెప్పుకొన వలయునని కవి యుద్దేశించినాఁడు—రూపము, కాన్తి, విదగ్ధ తలు, ప్రత్యేకమ..., నలంకరించుట యనుక్రియతో సంబంధించును. అట్లు సంబంధించుట వలన వచ్చినప్రాధాన్యము,రత్యుద్దీపకమగుటలోఁ బర్యవసానమునొందును.— ఈ ప్రాధాన్యము భాసింపవలె నను నభి ప్రాయముతోనే, కవి"రూపకాన్తి విదగ్ధతాః" అనిసమాసముఁ జేయక

రూపంచ, కాన్తిశ్చ యని వ్యస్తప్రయోగముఁ జేసినాడు.

మఱియొక యుదాహరణము:

"యాన్త్యా, ముహుర్వలితకంధర మాననమ్ త
దావృత్తవృన్తశతపత్రనిభం వహన్త్యా
దిగ్ధోఽమృతేన చ, విషేణ చ పక్ష్మలాక్ష్యా
గాఢం నిఖాతఇవ మే హృదయే కటాక్షః"

అర్థము: యాన్త్యాః = వెళ్ళుచున్నట్టియు, ముహుః =మాటిమాటికి, వలితకంధరమ్ = అడ్డముగఁ ద్రిప్పిన మెడగలట్టియు,(అందువలననే) ఆవృత్తవృన్త శతపత్రనిభం = త్రిప్పిన తొడిమెగల పద్మమును పోలియున్నటియు, ఆననమ్ = ముఖమును, వహన్త్యాః=మోయుచున్నట్టియు (కలిగినట్టియు) పక్ష్మలాక్ష్యాః = దట్టమైన కనురెప్పలుగల నాయికకు సంబంధించినట్టియు, అమృతేన = అమృతముచేతను (అనురాగభరితముచే నమృతమయము), విషేణచ = విషముచేతనుఁగూడ (వియోగకాలమున బాధనుకలుగఁ జేయునదగుటచే), దిగ్ధః= పూయఁబడినట్టియు, కటాక్షః = దృష్టి, మే = నాయొక్క, హృదయే = హృదయమునందు, గాఢం = లోఁతుగా, నిఖాత ఇవ = పాఁతబడినదివలె నున్నది.

అమృతము, విషము—అనుపదములు రెండును ప్రత్యేకముగ "పూయఁబడుట" యను క్రియతో సంబంధించును. అపుడు నాయకుని యందలి యుత్కంఠారూప సంచారి భావమున కుద్దీపము కల్గును. "అమృత విషాభ్యామ్" అని ద్వంద్వసమాసముఁ జేయుచో నాపదముల కుద్దీపకత్వముగాని, ప్రాధాన్యముగాని యింతగా భాసించెడిగాదు.

ఏకశేష స్థలమున కుదాహరణము:—

"ప్రాప్తావేకరథారూఢౌ, పృచ్ఛన్తే త్వామితస్తతః"

यमालंब्योत्पद्यते, स तस्यालंबनप्रत्ययः। यथा क्षेत्रमङ्कुरस्य कारणस्यानन्तरो निरोधः कार्यस्य समनन्तरप्रत्ययः यथा बीज निरोधोऽङ्कुरस्य समनन्तरप्रत्ययः बीजनिरोधमन्तरा अङ्कुरस्यो-त्पादासंभवात्। यस्मिन् सति यद् भवति तत्तस्याधिपतेय-मित्युच्यते। यथा जलपवनादिकमङ्कुरस्य। पुरोजातादय स्त्वेते-ष्वेवान्तर्भवन्ति, ईश्वरादयस्तु प्रत्यया एव न भवन्ति। अतः चत्वार एव प्रत्ययाः एते च परभूता एवेति।

अत्रोच्यते —

न हि स्वभावो भावानां प्रत्ययादिषु विद्यते
स्वभावेऽविद्यमाने तु परभावो न विद्यते ॥३॥

स्वस्य भावः, भवनं स्वभावः, विद्यमानत्वमिति यावत्। यदि परभूतेषु हेत्वादिप्रत्ययेषु व्यस्तेषु, समस्तेषु, वा, क्वचि-दन्यत्र वा, भावानां कार्याणां उत्पादात्पूर्वं, स्वभावः, विद्यमानत्व स्यात् तदा कार्यापेक्षया परभूतेभ्यः प्रत्ययेभ्यः कार्यस्योत्पाद इति शक्यते वक्तुम्। न चैव मुत्पादात्पूर्वसंभवो भावानाम् तथा सति उत्पादात् पूर्वमपि गृह्येत। उत्पादवैयर्थ्यंच स्यात् तस्मा-न्नास्ति भावानां प्रत्ययादिषु स्वभावः। एव मविद्यमाने भावानां स्वभावे परेभ्यो भवनं परभावः सोऽपिनास्ति अङ्कुरादीनां भावानां, बीजादिषु प्रत्ययेषु स्वभावे सिद्धे अङ्कुरापेक्षया बीजस्य परत्वं स्यात्। विद्यमानयोर्हि चैत्रमैत्रयोः परस्परापेक्षया परत्वं स्यात्। न चैवं भावानां प्रत्ययानां च यौगपद्यमस्ति तथा च क्रमपेक्ष्य प्रत्ययानां परत्वमिति वक्तव्यम्। तस्मात् अयुक्त-मेतत् यत्परेभ्यो भावानामुत्पत्तिरिति। यतोऽविद्यमाने स्वभावे परभावः परत्वं नोपपद्यते।

एवं प्रत्ययेभ्यः उत्पादवादिनि प्रतिषिद्धे क्रियातः उत्पाद वादी वदति। न चक्षुः रूपादयश्च प्रत्ययाः साक्षाद्विज्ञानमुत्पादयन्ति। विज्ञानजनिक्रियानिष्पादकत्वात् ते प्रत्यया उच्यन्ते। तस्मात् प्रत्ययवती विज्ञानजनिक्रिया विज्ञानमुत्पादयति। यथा पाकक्रिया ओदनस्येति।

अत्रोच्यते —

क्रिया न प्रत्ययवती नाऽप्रत्ययवती क्रिया
प्रत्यया नाऽक्रियावन्तः क्रियावन्तश्च ते उत। ४

प्रत्ययवती क्रिया नास्ति यदि काचित्क्रिया स्यात् सा रूपादिभिः प्रत्ययैः प्रत्ययवती विज्ञानं जनयेत् सैव नास्ति। कथम् इह दृश्यमाणा क्रिया जाते वा विज्ञाने इष्यते उताजाते वा, जायमाने वा। तत्र जाते न युक्ता क्रिया हि नाम भावनिष्पादका भावश्चेन्निष्पन्नः किमस्य क्रियया, "जातस्य जन्म पुनरेव च नैव युक्तम्" इत्यादिना दूषितत्वात्। एवमजातेऽपि न युक्ता क्रिया "कर्त्रा विना जनिरियं न च युक्तरूपं स्यात्" इत्यादिना निरस्तत्वात्। जायमानेपि क्रिया न संभवति। जाताजातव्यतिरेकेण जायमानस्यैवाभावात्। उक्तं हि "जायमानोऽर्धजातत्वात् जायमानो न विद्यते। अथ वा जायमानत्वं सर्वस्यैव प्रसज्यते" इति। यतश्चैवं त्रिष्वपि कालेषुजनिक्रियाया असंभव स्तस्मान्नास्तिसाजनिक्रिया। एतदेवोक्तम् क्रियान प्रत्ययवतीति। वंध्यापुत्रः श्रीमानिति वत्। यद्येवमप्रत्ययवती तर्हि भविष्यति। तदपि न युक्तमित्याह। नाऽप्रत्ययवतीति। यतः पूर्वोक्तरीत्या क्रियाया एवासंभव स्तस्मादप्रत्ययवत्यपि क्रिया नास्ति। यदा क्रिया नास्ति तदा यदक्रियावन्तः ते भावाः कथं प्रत्ययाः। भावा-

नां जनकाः। भावानां जनका न भवन्त्येवेति यावत्। यदा क्रियैव नास्ति तदा ते प्रत्ययाः क्रियावन्तोऽपि न भवन्त्येव। उत अव-धारणे। पाकक्रियादयोऽप्येवं वेदितव्याः।

ननु किमेतेन प्रत्ययाः क्रियावन्तः उताक्रियावन्तः इत्यादि विचारेण। यस्माच्चक्षुरादीन् प्रत्ययान् प्रतीत्य ज्ञानादयो भावा उत्पद्यन्ते तस्माच्चक्षुरादीनां प्रत्ययत्वं तेभ्यः विज्ञानादीनामुत्पाद इत्येतदप्ययुक्तमित्याह।

उत्पद्यन्ते प्रतीत्येमानितीमे प्रत्ययाः किल
यावन्नोत्पद्यन्त इमे तावन्नाप्रत्ययाः कथम् ॥५॥

चक्षुरादीन् प्रत्ययान् प्रतीत्य विज्ञानमुत्पद्यते इति चक्षु-रादयः प्रत्ययाः इति ते मतम्। तर्हि यावद्विज्ञानात्मक कार्यं नोत्पद्यते तावदिमे कथं नाऽप्रत्ययाः तथा च कथमप्रत्ययेभ्यः कार्यस्योत्पत्तिः। अथ पूर्वमप्रत्ययाः सन्तः किञ्चिदन्यत्प्रत्यय-मपेक्ष्य। प्रत्ययत्वं प्रतिपद्यन्त इति। एतदप्ययुक्तम्। यत्तत्प्रत्य-यान्तरमप्रत्ययस्य प्रत्ययत्वे निमित्तं कल्प्यते, तदपि प्रत्ययत्वे सत्यस्य प्रत्ययो भवति। तत्राप्ययमेव दोषः पर्यापतति।

किञ्चह चक्षुरादयः विज्ञानस्य प्रत्ययाः कल्प्यमानाः किं सतोऽस्य कल्प्यन्ते उतासतः सर्वथापि न घटत इत्याह।

नैवासतो नैव सतः प्रत्ययोऽर्थस्य युज्यते
असतः प्रत्ययः कस्य सतश्च प्रत्ययेन किम् ॥६॥

असतः अविद्यमानस्यार्थस्य प्रत्ययः कथं स्यात्। भविष्यता व्यपदेशो भवतीति चेन्न "शक्तिं विना नास्ति हि भाविताऽस्य" इत्यादिना दूषितत्वात्। सतोऽपि भावस्य निष्फलैव प्रत्यय-कल्पना।

एवं समस्तानां प्रत्ययानां कर्योत्पादन-सामर्थ्याभावाद्-प्रत्ययत्वमावेद्य, इदानीं व्यस्तानामप्यप्रत्य यत्वमुपपाद्यते। अत्र कश्चिदाह। यद्यप्येवं प्रत्ययाना मसम्भवः। तथापि "तत्र निर्वर्तको हेतु" रिति हेतु प्रत्ययस्य लक्षणोपदेशाद्सतत्र लक्षणा-योगादस्ति हेतुप्रत्ययइति। अत्रोच्यते स्याद्धेतु प्रत्ययः। यदि तस्य लक्षणमुपपद्येत। तदेव न संभवति। कुतः

न सन्नासन्न सदसद्धर्मो निर्वर्तते यतः
कथं निर्वर्तको हेतुरेवं सति हि युज्यते ॥७॥

यदि निर्वर्त्यो भावः निर्वर्त्येत तं निर्वर्तको हेतुरुत्पाद्-येत्। तच्च न संभवति। सदसदुभयरूपस्य निर्वत्यस्यासंभवात्। तत्र स न निर्वर्त्यते। विद्यमानत्वात् नाऽप्यसन्निवर्त्यते। अविद्य-मानत्वादेव। नाऽपि सदसन्निर्वर्त्यते। एकस्य युगपद्विरुद्धोभय-रूपासंभवात्। उभयपक्षोक्तदोषप्रसंगाच्च। तस्मात्कार्यस्योत्पत्त्य संभवाद्धेतुप्रत्ययो नास्ति।

इदानी मालंबनप्रत्यय निषेधाथमाह।

अनालंबनएवायं धर्मस्सर्वो निगद्यते
अथानालंबने धर्मे कुत आलंबनं पुनः ॥८॥

इह सालंबनधर्माः कतमे? 'सर्वचित्तचैत्याः इत्यागमा चित्तचैत्याः येनालंबनेनोत्पद्यन्ते, यथायोगं रूपादिः। एतेषामा-लंबनप्रत्ययाः स च विद्यमानानां वा कल्प्येत, उत अविद्यमानानां वा तत्र विद्यमानानांमालंबन प्रत्ययेन नाथः। धर्मस्योत्पत्त्यर्थं आलंबन परिकल्प्यते। स चालंबनात्पूर्वमेव सिद्ध इति किं तस्या-लंबनयोगेनेति भावः अथाविद्यमानस्यालंबनं परिकल्प्यते, तदपि न युक्तम् अनालंबने धर्मे अविद्यमाने सति, तस्याविद्यमानस्या-लंबनेन योगो नास्स्तीतिभावः। आलंनवताभावादालंबनमपि

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ. డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమేత్యాది బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు

సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, శ్రీచతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

శ్రీమూర్తి ప్రతివాదభయంకర పార్థసారథిగారు, బి,ఏ., యల్.యల్. బి.

## కోశాధ్యక్షులు

శ్రీమూర్తి ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి.ఏ., యల్.యల్. బి.

## కార్యనిర్వాహక వర్గము

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ., బి. ఎల్.

శ్రీ వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇ.డి

శ్రీ భమిడిపాటి సూర్యనారాయణశర్మగారు.

శ్రీ వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ, చిలుమూరి పాపయ్యశాస్త్రిగారు.

కవికంఠీరవ, కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

ఐతిహాసిక సమ్రాట్ శ్రీ బండారు తమ్మయ్యగారు.

భాషాప్రవీణ శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు,

మధురకవితావిశారద,

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, యం ఎ., బి. ఇ. డి.

శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు.